# RANGARAYA CHARITRAM

BY

DITTAKAVI NARAYANA KAVI



**V. Ramaswamy Sastrulu & Sons,**

*192, Esplanade, Madras, E.*

**1914.**

# ఆంధ్రగ్రంథములు.

| | | ప్రతి 1–5 రూ. | అ. |
|---|---|---|---|
| శ్రీమదాంధ్రభారతము, ఆది సభాపర్వములు, 1 వ సంపుటము | ... | 1 | 12 |
| ,, విరాట ఉద్యోగపర్వములు, 2 వ సంపుటము | ... | 1 | 12 |
| శల్యాదిపర్వములు | అచ్చగుచున్నవి. | | |
| కృష్ణరాయవిజయము, చక్కనికూర్పు | ... | 0 | 8 |
| ఉత్తరరామాయణము, కంకంటి. పాపరాజప్రణీతము, చక్కనికూర్పు | ... | 1 | 0 |
| డిటో మేలుప్రతి, కాలికోబైండు | ... | 1 | 8 |
| భాస్కరరామాయణము, చక్కనికూర్పు | ... | 2 | 8 |
| రంగనాథరామాయణము, ద్విపద, చక్కనికూర్పు. | | 1 | 8 |
| మొల్లరామాయణము, చిన్నసైజున పెద్దక్షరములతో చక్కగముద్రితము | ... | 0 | 8 |
| అచ్చతెనుగురామాయణము, శుద్ధప్రతి | ... | 1 | 4 |
| ఆంధ్రభాగవతము, పోతనామాత్య ప్రణీతము, ఇదివఱకు ముద్రితమైన ప్రతులకన్న అక్షరములు బాగుగనున్నవి | ... | 3 | 0 |
| డిటో ఉత్తమప్రతి, రెండువాల్యములు | ... | 5 | 8 |
| వసుచరిత్ర, సవ్యాఖ్యానము, పదసరిశోధితములు చక్కనికూర్పు | ... | 2 | 8 |
| మనుచరిత్ర, సటీక | ... | 1 | 8 |
| ఆముక్తమాల్యద, సటీక, | అచ్చగుచున్నది. | 2 | 8 |
| ప్రభావతీప్రద్యుమ్నము | ... | 0 | 8 |
| కళాపూర్ణోదయము, పదసరిశోధితము | ... | 1 | 8 |
| రాఘవపాండవీయము, సటీక, చక్కనికూర్పు | ... | 1 | 8 |
| ఉత్తరహరివంశము, నాచనసోమనాథకృతము. | ... | 1 | 4 |
| అప్పకవీయము, చక్కనికూర్పు, అట్టబైండు | ... | 1 | 6 |
| ఆంధ్రనామసంగ్రహము, ఆంధ్రనామశేషము, సాంబనిఘంటువు టీకానుక్రమణికాసహితము, కాలికోబైండు | | 0 | 12 |
| సులక్షణసారము, సటీక | ... | 0 | 8 |

శ్రీరస్తు.

శ్రీకృష్ణ

# రంగారాయచరిత్రము.

దిట్టకవి నారాయణకవి ప్రణీతము.

బొబ్బిలి సంస్థానాధిపతులు

శ్రీమహారాజా రావు సర్

వేంకట శ్వేతాచలపతి రంగారావు బహద్దర్ కే. సీ. ఐ. ఇ.

వారి యనుమతిని



చెన్నపురి :

వావిళ్ల. రామస్వామిశాస్త్రులు అండ్ సన్సు వారిచే

ప్రకటితము.

1914



శ్రీరస్తు.

# రంగారాయచరిత్రము.

## పీఠిక.

---

శా. శ్రీమద్భూమిభవస్వవాంగరుచిరశ్రీనాథ వామాంకసీ
మామధ్యంబునఁ జేర్చి లోకవితతి న్మన్నించు ధన్యుండు లీ
లామర్త్యాకృతిరాఘవుండు సుగుణాలంకారు మల్రాజు శ్రీ
రామారాయవసుంధరాధిపుఁగృపన్ రక్షించు నశ్రాంత
మున్. 1

మ. విమలాంభోజసువర్ణకర్ణికపయిన్ వెల్గొందు పూఁబోఁడిచం
ద్రము పైదో డగు ముద్దరాలు మురజిద్వక్షస్థలిం బొల్చు
శ్రీ,తమయుంఖాననపాలవెల్లి నిసువోఁ దామ్రాధరోష్ఠీవతం
సము మల్రాజుకులాబ్ధిచంద్రుని మహైశ్వర్యాన్వితుం జేయు
తన్. 2

చ. తొలుబలుకుల్ నిజాననచతుష్టయమార్గవినిర్గతంబులై
నెలకొని వర్ణధర్మముల నిర్ణయముల్ పరికింపుచున్ జగం
బుల వెలయింపఁగాఁజెలఁగు ప్రోడ విరించి చిరాయురున్నతు
ల్, పొలుపు దలిర్ప రామనృపపుంగవమౌళి కొసంగుఁ
గావుతన్. 3

ఉ. ఆయతమౌక్తికగ్రథితహారమునం జెలువొప్పు విస్ఫుర
న్నాయకరత్న మట్లు సుమనస్తతి కెంతయు నగ్రగణ్యుఁడై
పాయక యంతరాయములఁ బాపు గజాస్యుఁడు రామ
మేదినీ, నాయకవాళికిం గృప ననారతముం సమకూర్చు
నిష్టముల్. 4

శా. చాపంబుం డమరు త్రిశూల శరముల్ శాతాసి ముఖ్యా
యుధ,వ్యాపారంబునుఁ బాణిపంక్తులఁ దలిర్పం శాబరో
ద్వేల హే,లాఘుంభావమునం జెలంగి విజయోల్లాసంబునం
బొంగుచ, య్యాపూరీపురవీరభద్రుఁడు జయం బిచ్చుం
గృతిస్వామికిన్. 5

శా. వీణాపుస్తకముల్ కరాబ్జయుగళిం బెంపొంద విద్వత్కవి
శ్రేణీజిహ్వలపై నటింపుచు రమాసీమంతినీరత్నశ
ర్వాణీముఖ్యసతీవతంసములకు న్వైదగ్ధ్యముల్ నేర్పున
వ్వాణీదేవి యొసంగు మత్కృతికి వాగ్వైచిత్ర్యమాధు
ర్యముల్. 6

తే. కాళిదాసమయూరమాఘప్రభృతుల
నుతులఁ దేలించి యాంధ్రసత్కృతు లొనర్చు
నన్నపార్యుండు తిక్కన నాఁ దనర్చు
ప్రాక్తనకవీంద్రచంద్రులఁ బ్రస్తుతింతు. 7

ఉ. నిబ్బర మైన యక్కరము నేర్చినవారలపోల్కె వట్టి త
బ్బిబ్బులు నాలుగల్లి తమభీకరవేషవిశేషపుష్టికై
యుబ్బి భ్రమల్లసం గదిసి యొంటరిపాటున మూఢసన్నిధిం
డబ్బులు గొట్టు దుష్కవులు డాయఁగ నోపుదు రే రసజ్ఞులన్

వ. అని యిష్టదేవతావందనంబును సుకవికవితాభినందనం
బును గుకవినిందనంబునుం గావింపుచు నిదానీంతనమహా
వీరపురుషపౌరుషరసానుబంధబంధురం బగునొక్క ప్రబం
ధంబు రచియింపం గోరి యున్నసమయంబున. 9

సీ. శ్రుతగుడక్షోణభృత్క్షితిమండలోచిత
ప్రాజ్యరాజ్యరమాధురంధరుండు
దానధారాధౌతధరణీసుపర్వాను
సారిదారిద్ర్యరజస్తముండు
సంగీతసాహిత్యసరసవిద్యారస
రసికతామహితసారస్వతుండు
సామంతభూపాల సంప్రేషితద్విప
దానకర్దమితసద్మాంగణుండు
తే. పద్మనాయకకుముదినీబాంధవుండు
దర్పితారాతిరాజన్యదర్పమథన
రాజితాటోపకేళి మల్రాజవంశ
పద్మవనహేళి రామనృపాలమౌళి. 10

ఉ. డెబ్బదియేడుగోత్రముల ఠీవి వహించిన యాత్మవర్ణపు
న్నిబ్బర మైనపౌరుషము నేర్పుమెయి న్వెలమ ల్వచింపుచో
బొబ్బిలిరావు వారలయపూర్వపరాక్రమ మబ్బురంబుగాఁ
బ్రబ్బినతచ్చరిత్రము ప్రబంధముఖంబున నాలకింపఁగన్

వ. మహోత్సాహం బుదయించి యుదంచితశాస్త్రప్రపంచ
సరస్సంచరన్మనోహంసు లగువిద్వాంసులును కవిత్వరచనా
చమత్క్రియాచరితోత్సవు లగుకవులును రాజకార్యస్వతం

త్రులగుమంత్రులును నాయకులును గాయకులును దక్కఁ
గలపరివారంబు గొలువఁ గొలువుండి గోష్ఠీవినోదంబున.

మ. ననునానాపృథివీంద్రచంద్రకృతసన్మానుఁ రఘూత్తంస పా
వనపాదాంబుజసేవనానిరతుసత్ప్రాచీనవిద్వత్కవీ
శనికాయాదరణీయదిట్టకవివంశప్రోద్భవుఁ ధీరసా
యను నారాయణుఁ జూచి యిట్లు పలికెఁ హర్షాంబుధిం
దేల్చుచున్. 13

తే. హేమభూషావిశేషవర్షాశనాగ్ర
హారముఖ్యబహూకృతుల్ గారవమున
నందుకొంటివి మాచేత నస్మదాశ్రి
తాగ్రణివి దిట్టకవిరాజ యరుణతేజ. 14

ఉ. భారతయుద్ధమట్టు లతిభాసురతం గనుపట్టుచు న్మహా
వీరరసప్రధాన మయి వేడుక నింపెడురావు వారిదు
ర్వారరణప్రసంగమతిరమ్యతరం బది గద్యపద్యసం
భారయుతంబుగా నొకప్రబంధ మొనర్పు మదంకితంబుగన్.

వ. అని యనూనయింపుచుం బరిమళపరిమిళిత. కర్పూరవీటీ
కనకశాటీ నిరాఘాటధాటీ జనవఘోటీ పరంపరాది సత్కా
రంబులఁ బ్రియంబుఁగొలుపుటయుం గౌతూహలంబు వొ
డమి తత్ప్రారంభంబునకు మంగళోజ్జృంభణంబుగాఁ గృతి
పతివంశావతారం బభివర్ణించెద. 16

మ. సనకాదుల్భజియింతు రెవ్వనిపదాబ్జాతంబునే పుణ్యశీ
లుని యంఘ్రిం జనియించి జాహ్నవి కడుఁ లోకత్రయీ
లోకపా, వని యానట్టి రమామనోహరుని దివ్యశ్రీపదాం

భోరుహం, బున జన్మించిరి పద్మనాయకులు విస్ఫూర్తిం బ్రవ
ర్తిల్లుచున్. 17

క. ఆపద్మనాయకాగ్రణు
లేపల రెడు వేడ్క డెబ్బదే డగుగోత్ర
వ్యాపాదితనియమస్థితి
దీపించిరి వెలమసంజ్ఞ తేజరిలంగన్ 18

క. ఆసప్తోత్తరసప్తతి
భాసురగోత్రములయందుఁ బ్రతిభాకరమై
భాసిలె విరియాలాఖ్యఁ
వాసిం గలగోత్ర మెన్న వన్నె దలిర్పన్. 19

శా. కల్లోలి న్యధినాథతుల్యవిలసద్గాంభీర్యుఁడై శారదో
త్ఫుల్లాంభోరుహవల్లరీ హిమరుచిరీ భూతేశవాక్సుందరీ
మల్లీ స్వర్గవారీ కరీంద్రయశుఁడై మల్రాజువంశంబునఁ
వల్లారాయనృపాలమౌళి వొడమెఁ వార్ధిఁ మృగాంకాకృతిన్. 20

సీ. తనచేతినిశితాసిధారావిధుంతుదుం
డహితానసేందుల నాక్రమింపఁ
దనరణభేరికాధ్వనిగర్జితంబులు
విమతహంసములకు వెఱపుఁ జూప
దనవాహఖురపుటీజనితధాత్రీధూళి
పరిపంథికంథులమురువుడింపఁ
దనజయధ్వజవీరహనుమంతుఁ డభియాతి
యాదోనిధానంబు లవఘళింప

తే. నలరు నమితవిరోధి ధరాధనాథ
రత్నమకుటాంశురాజినీరాజితాంఘ్రి
నఖరశిఖరసుధాంశుండు నయవచోభి
రామగీష్పతివల్లభరాయనృపతి. 21

సీ. ఆవల్లభనృపాల దేవవల్లభునకుఁ
దనయులు జనియించి రనఘమూర్తు
లసమానలసమానహారివాక్చాతురీ
పన్నగపతి పెదచ్చన్నగారు
శతమన్యుసన్నిభాద్భుతజగన్నుతసంప
దౌన్నత్యనిధి చినచ్చన్నగారు
వితరణశ్లాఘానవీనకర్ణఖ్యాత
ఘనకీర్తిశాలి జగ్గన్నగారు
తే. కొండమక్ష్మాతలాధిపాఖండలుండు
నాఁగ నలువురు దశరథనందనప్ర
తీతసౌభ్రాత్రకలితప్రదీప్తు లగుచుఁ
ద్రిజగదభినంద్యవైభవశ్రీలఁ దనర. 22

క. ఆనలుగురిలోఁ గొండ
క్ష్మానాయకుఁ డలరె దశదిశామానవతీ
మానిత నానాభూషా
నానట దురుమార్తికాభనవ్యయశుండై 23

సీ. ఆశ్రితప్రకరవన్యాదైన్యనిరసనా
సంభ్రమాశ్రాంతవసంతఋతువు
విద్వద్గృహాంగణావిర్భూతనిజరూప
సంరంభయుతసారసారశ్రేయి

కవిజనానీకలోకక్రమోదాపాది
విస్రంభశుంభత్సహస్రరశ్మి
సకలబాంధవచకోరకనికాయతపఃఫ
లాయితరాకాసుధాంశుబింబ
తే. మతఁడు నృపమాత్రుఁడే చతురంబురాశి
వలయితక్ష్మాసుపర్వానువర్ణ్యమాన
భూరివితరణవిజితమందారశాఖ
రాజితాకృతి కొండలరాయనృపతి. 24
మ. జలజాతాత్మభవప్రగల్భవచనశ్లాఘానిరాఘాటమం
జులతాలంఘనజాంఘికంబుల హిరాట్సువ్యక్తవక్త్రావళి
స్ఖలితాలాపకలాకలాపములు నై కన్పట్టు మల్రాజుకొం
డలరాయప్రభుసార్వభౌముని ప్రచండప్రౌఢవాగ్ఝల్లరుల్
క. ఆకొండలరాయధరి
త్రీకాంతవతంసమునకు దివిషత్తటినీ
వ్యాకోచపుండరీకర
మాకల్పయశులుకుమారు లాఱ్వురు వరుసన్. 26
శా. లీలాసూనశరాసనుల్ వొడమి రా లింగన్న జగ్గక్షమా
పాలగ్రామణి రామభూమిపతియుం బార్థోపమాటోపదో
శ్శీలుండై తగు రామచంద్రనృపుఁడున్ శ్రీరంగపత్న్యావరుం
డోలిన్ మల్లనృపాలమౌళియు ననా నుర్వీశచూడామణుల్
క. వారలలోపలఁ గులవి
స్తారకుఁడై సుకవివిద్వదాధారుండై
ధీరోదాత్తుఁడు రామ
క్ష్మారామారమణుఁ డలరె వరసులు వొగడన్. 28

సీ. అతనిచేతికటారి కభియాతినృపశరీ
రములు సజీవకోశములు గావె
యతనిశౌర్యాగ్నికి నభియాతినృపదుర్గ
తండముల్ హోమకుండములు గావె
యతనియాగ్రహశక్తి కహితభూభృచ్ఛిరః
కమలముల్ కబళకోశములు గావె
యతనిజయేందిరకరిరాజకరికుంభ
నికరముల్ హారపేటికలు గావె
తే. భళిభళీ యని తనప్రతాపంబుఁ గాంచి
సకలదిగ్దేశనృపతులు సన్నుతింప
నలరు బెల్లపుకొండ ధరాధిరాజ
రాజమార్తాండమూర్తి యారామనృపతి. 29

మ. అలఘుశ్రీనిధియట్టిరామవసుధాధ్యక్షుండు గాంచెన్ గు
మా, రుల మాద్రేయులఁ బాండురాజుకరణిన్ రుద్రప్రతా
పుండు కొం, డలరాయప్రభుసార్వభౌముఁడు ప్రచండా
టోపియౌ వేంకటుఁ, చలధాత్రీపతి నాఁగ నిర్వారమహా
సామ్రాజ్యధౌరేయులన్ 30

సీ. అర్థిదారిద్ర్యముద్రాంధకార మడంపఁ
జంద్రార్కుల తెఱంగు సంగ్రహించి
దుష్టనిగ్రహకళాదోహలస్ఫురణచ్ఛే
రామలక్ష్మణుల బీరంబు నెరపి
క్షాత్రవోత్కరజయోత్సాహసాహసమున
భీమార్జునులపోల్కి దీముకొల్పి

లలితవిలాసలీలాచారుచర్యల
బలరామకృష్ణుల పటిమఁగల్గి
తే. వార లిరువురు సౌహార్దవైభవముల
నంచితస్ఫూర్తి మిగుల దీపించి రెలమి
రహి వహింపుచుఁ గొండలరాయనృపతి
వేంకటాచలమహిభృన్మృగాంకమూర్తి. 31
క. అం దగ్రజుండు శశిభృ
చ్చందనకుందారవిందసాంద్రయశశ్శ్రీ
లందెను కొండలరాయపు
రందరుఁడు నిజాన్వయానురంజనకరుఁడై. 32
ఉ. కొండలరాయనిం గెల్వఁ గోరు సమున్నతధైర్యసంపదన్
గొండలరాయనిం జెనకఁ గోరు నఖండతరాతిభూతిచేఁ
గొండలరాయనిన్ సమతఁ గోరు నతప్రకరావనక్రియన్
గొండలరాయభూరమణకుంజరుఁ డెన్న నృపైకమాత్రుఁడే.
సీ. దశరథసూతి యీధన్యుండు గాకున్న
నరిపంక్తికంఠసంహర్త యెట్లు
బలరాముతమ్ముఁ డీప్రభుమౌళి గాకున్న
సత్యాభిరామప్రచారుఁ డెట్లు
రాకామృగాంకుఁ డీరమణుండు గాకున్నఁ
గువలయానందనప్రవణుఁ డెట్లు
జంభవిద్వేషి యీజనపతి గాకున్న
నహితబలచ్ఛేది యగుట యెట్లు
తే. లని జనంబులు వెయినోళ్లఁ దనుభజింప
నప్రతీపప్రతాపమహాప్రదీప

శమితరిపువర్గదోర్గర్వతిమిరుఁ డలరు
రమ్యగుణహారి కొండలరాయశౌరి. 34

శా. ఆసౌభాగ్యబలారి గైకొనియె భార్యాయుగ్మముం గొండ
మాం, బాసాధ్వీమణిఁ జిన్నపాపమసతిం బద్మామనోభర్తల
క్ష్మీసర్వంసహల న్వరించుపగిదిన్ శ్రీరుక్మిణీ సత్యభా
మాసీమంతవతీవతంసములఁ బ్రేమం గృష్ణుచందంబునన్

మ. అనసూయాసతి నన్నపూర్ణను బులోమాత్మోద్భవారుం
ధతీ, వనితారత్నములం బయోధితనయన్ వైదేహి
నశ్రాంతముం, దనసౌశీల్యపతివ్రతాత్వవినయౌదార్యాదు
ల న్మించి పే, ర్గాను కొండమ్మకు నింకఁ గాంత లెనయే
కొండొక్క రిమ్మేదినిన్. 36

సీ. తనదయాలీలాంచితనయవిశేషముల్
సకలార్థిజనములు సంస్తుతింపఁ
దనసాధువినయవర్తనసొంపు సేవించి
యుభయవంశంబులు నుత్సహింపఁ
దనగుణపారిజాతనవీనవాసనల్
నిఖిలకకుప్పాళి నిండికొనఁగఁ
దనతాల్మికల్మి యింతనరాక వెగడొంది
తోడిచేడియల కుత్సుకత నెరప

తే. దనరు నాత్మీయసౌశీల్యదానధర్మ
విభవసౌభాగ్యకారుణ్యవిశదకీర్తి
సాధుమాధుర్యనయగుణసారముదిత
బంధునికురంబ శ్రీచినపాపమాంబ. 37

సీ. అందగ్రమహిషియం దలఘుప్రతాపుని
వేంకటరామపృథ్వీపతిలకు
సన్నుతౌదార్య సూర్యన్నప్రభూత్తంసు
రామభూమీమండలామరేంద్రుఁ
గొండొకసతియందు గురుశౌర్యు వేంకట
నరసింహరాయభూవరవతంసు
ఘనునివల్లారాయ జననాయకవరేణ్యు
రామచంద్రకుమారమణచంద్రుఁ
తే. గ్రమము దీపింపఁ బుత్రషట్కంబు గాంచె
మువుర ముప్పురసమతానుమోదలీల
నమ్మహాసాధుసాధ్వీయుగ్మ మ్మెలర్పఁ
బ్రబలరుచిహేళి కొండలరాయమౌళి. 38
తే. తత్తనూభవషట్కసౌందర్యధైర్య
శౌర్యచాతుర్యధుర్యతాసరణిఁ దెలియ
విన్నవించెద మిగుల వేర్వేర నెన్ని
సకలజనమానసానురంజకము గాఁగ. 39
సీ. ఏధన్యుసత్కీర్తి యిందుకుందమరాళ
ధారాళరుచులతోఁ దారసించు
నేధీరువితరణం బినతనూసంభవు
విశ్రాణనప్రౌఢి వీటబుచ్చు
నేవీరుదోశ్శౌర్య మింద్రనందనభుజా
పాండిత్యమునకు విభ్రాంతి యొసఁగు
నేభవ్యుసౌందర్య మిక్షుచాపసురూప
నైపుణ్యగుణముల నేఁపు గాంచు

తే. నతఁడు చెల్వొందుఁ బ్రణమితాహితశిరస్థ
రత్నమకుటమరీచిపూర ప్రరోహ
రాజినీరాజితాంఘ్రినీరేజయుగళి
రాజపవిధారి వేంకటరాయశౌరి. 40

సీ. తనరాజసంబు మాంధాతృభగీరథ
దశరథసగరులదశవహింపఁ
దనచక్కఁదనము కందర్పనైషధరాజ
రాజతనూజుల నోజఁ దెగడఁ
దనదానపటిమ రాధాసుతజీమూత
జీమూతవాహుల చెలువుఁ జూపఁ
దనపరాక్రమము మందాకినీనంగన
శరవణోద్భవుల కచ్చెరువు నింప

తే. నిం పలరుఁ దారకాశరదిందుకుంద
శారదాశారదాభ్రమందారచంద్ర
దరహారవియన్మతంగజధవళయశుఁడు
రాజదివిషద్విభుండు సూనప్రభుండు. 41

ఉ. క్రొన్ననవింటివాని యనుగుంజెలిచక్కఁదనంబునందు వే
గన్నులవానిపట్టి కధికరి బగు జోదుపరాక్రమంబునన్
మిన్నులమానికం బపరిమేయరుచిస్ఫురణన్ మహాత్మురా
మన్నను బ్రస్తుతింపఁ దరమా ధరమానవకోటిలోపలన్. 42

సీ. అర్థార్థిజనకామితావాప్తి యొనరింప
నవనికి డిగ్గిన యమరతరువొ
కనకధారాసారగౌరవస్ఫురణంబు
నెరప వచ్చినయట్టి నీరదంబొ

భూలోకసంచారఖేలనానిరతిమైఁ
గనుపట్టుచుండెడి కామగవియొ
పద్మనాయకమణిభావంబు గైకొని
మహిఁ జెలంగెడు వేల్పు మానికంబొ
తే. భళిర యితఁ డని తనుజను ల్ప్రస్తుతింప
వెలయు విరియాలగోత్రపవిత్రమూర్తి
చారుతరకీర్తి నరదేవచక్రవర్తి
భవ్యరుచిహేళి రామభూపాలమౌళి. 43
సీ. తనరూపు మీనకేతనవసంతజయంత
సౌందర్యధిక్క్రియాసరణిఁ బొదల
దనవదాన్యతవికర్తనతనూజదధీచి
శిబికుబేరాదుల సిగ్గుఁబరచఁ
దననీతిపటిమ శాంతనవకామందక
చాణక్యమనువుల జాడఁ దెగడఁ
దనరాజసము పురాతనరాజలోకైక
చూడావతంసకస్ఫురణఁ దెలుప
తే. శ్రుతగుడక్ష్మాభృదధిపుఁడై సొంపుఁ గాంచె
సైపుఖానవజీరభుజావలేప
లోపకృద్వీరవిజయప్రతాపశాలి
వేంకటనృసింహరాయ పృథ్వీపమౌళి 44
శా. మల్లీవల్లరులన్ హసించు విలసన్మందారకుందారవిం
దోల్లోలన్నవమంజరీరుచులపై హుంకించు నభ్రాపగా
కల్లోలంబుశుభప్రభానిభములై కన్పట్టు మలాబ్జ శ్రీ
వల్లారాయనృపాలచంద్రునియశోవల్లీసముల్లాసముల్ 45

క. ఆధన్యుని పినతండ్రి సు
ధాధారారుచిరరుచివిధాయకవాచా
మాధుర్యైకనిధానగు
ణాధారుఁడు వేంకటాచలాధిపుఁ డలరెన్. 46

సీ. అశ్రాంతవిశ్రాణనాభినంద్యపౌఢి
యిసతనూభవునందు నితనియందు
సంగనాజనమనోహరరూపసౌష్ఠవం
బిందిరాసుతునందు నితనియందు
క్ష్మాభారభరణరక్షాదక్షదోశ్శక్తి
ధృతరాష్ట్రతనయునం దితనియందు
రణరంగవిజయశౌర్యప్రసంగనిరూఢి
యింద్రనందనునందు నితనియందుఁ
తే. గాని కాన మటంచు లోకము నుతింప
స్ఫుటతరౌదార్యరూపప్రభుత్వశౌర్య
ధర్మములయందు మూరెండుఁ దనకు లేక
నలరు మల్రాజవేంకటాచలవిభుండు. 47

తే. అమ్మహాబాహుగేహిని యతిశయిల్లు
నాస్యలక్ష్మీనిరస్తసుధాంశుబింబ
యాశ్రితజనావనాంచద్దయావలంబ
యన్నపూర్ణాకృతివిడంబ యన్నమాంబ. 48

—ఏ ష ష్ఠ్యం త ము లు.—

క ఈదృగ్విధాన్వవాయసు
ధోదన్వచ్చంద్రమునకు సుర్వీజ్ఞనం

మోదకరదానదాక్షి
ణ్యాదిగుణానీకనిధికి నప్రతినిధికిన్. 49

క. లాటయుగంధరకురుక
ర్ణాటద్రవిళాంగవంగనానావనిభృ
త్కోటీరఘటితమణిఘృణి
పేటీభవదంఘ్రినఖరబిరుదాంకునకున్. 50

క. శ్రీమంతున కతివినమిత
సామంతునకుఁ లసద్యశశ్శ్రీకితది
క్సీమంతున కరిసరసిజ
హేమంతున కలఘుధైర్యహిమవంతునకున్. 51

క. కరుణారసార్ద్రమతికిఁ
జరణానతవిమతతతికి శౌర్యోన్నతికిం
దరుణార్కసమద్యుతికిని
ధరణీభృద్ధృతికి పుష్పధన్వాకృతికిన్. 52

క. కనదుఝుదరస్మితయుతా
ననసరసీజునకు భూజనస్తుతలీలా
ఘనభాగ్యబిడౌజునకుఁ
దినకరతేజునకు సాహితీభోజునకున్. 53

క రాజదిలీపునకుఁ విమ
లాబ్జాన్వయకలశసాగరకలాపునకుఁ
రాజత్కలాపునకు న
వ్యాజసుధామధురపేశలాలాపునకున్. 54

క. శాంతరసపాండవాగ్రణి
కంతర్వాణిప్రతానహాగప్రదునై

రంతరవితరణసరణికిఁ
గాంతాంబాతనయమణికి ఖలగజసృణికిన్. 55

క. శరనిధిగాంభీర్యునకుఁ
సరసౌదార్యునకు మేరుసమధైర్యునకుఁ
స్మరనిభసౌందర్యునకుఁ
నిరుపమశౌర్యునకు రామనృపవర్యునకున్. 56

వ. అభ్యుదయపరంపరాభివృద్ధిగా నఖిలకకుబంతవిశ్రాంతప్రసిద్ధిగా నంకితం బొనర్పంబూనిన యిమ్మహాప్రబంధంబునకుఁ గథాక్రమం బెట్టిదనిన. 57

---

కథాప్రారంభము.

మ. అమరేంద్రుం డొకనాఁడు కాల్యకరణీయంబుల్ నివర్తించి రు, క్మమణీకీలితమండనప్రకరముల్ గైచేసి యాంగీరసప్రముఖోదరితపూర్వపుణ్యపురుషప్రఖ్యాతచర్యాసుధాప్తిమహాహ్లాదుఁడై సుధర్మ నొప్పై పేరోలగం బున్నెడన్.

సీ. అమరావతీనగర్యంతరాంతరవినో
దావలోకనజాతహర్షముననొ
రంభాప్రభృత్యప్సరఃకామినీపయో
ధరధరారోహణోత్సాహముననొ
మాహేంద్రలోకసామ్రాజ్యేందిరాసమా
క్రమణసంసక్తదీక్షాభిరతినొ
మైరావణభుజాబల్యాత్మీయదోస్సార
తారతమ్యజ్ఞానతత్పరతనొ

తే. ప్రమద మెసఁగంగ మర్త్యలోకమున నుండి
నిండి రెల్లెడ తండోపతండములుగ
నింద్రపురియందు నిజభుజాహీనచలిత
కలితకరవాలవీరు లాకస్మికముగ. 59

తే. అట్లు చనుదెంచుచున్న శూరాగ్రయాయి
జననికాయంబుఁ గాంచి యాశ్చర్య మొంది
తత్పురీగూఢచరు లతిత్వరత నేగి
మరుదధీశ్వరుఁ గాంచి నమస్కరించి. 60

శా. దేవా దేవర వీటి కెవ్వరో ధరిత్రీభాగమందుండి తే
జోవైశ్వానరులాజిరంగనరులత్యుగ్రప్రభాభీక్ష్ణబా
హావిక్షేపితశాతహేతిరుచిధారాకృష్టదుష్టాహిత
క్ష్మావర్యేంద్రు లేగుదెంచి కనదాశ్చర్యం బవార్యంబుగన్.

సీ. ఉచ్చైశ్శ్రవంబు చుంచోడసి పట్టి చరాల్న
నెగిరి యొక్కుమ్మడి నెక్కువారు
నందనోద్యానమన్దారశాఖలు వంచి
యొఱపుగా నుయ్యేల లూఁగువారు
కామధేనువ నడ్డఁ గట్టి గుమ్మలు గ్రోలి
యాబెయ్య యిది మంచి దనెడివారు
సురసరిత్కనకతామరసమ్ము లుడివోక
తెమలించి బారుగాఁ ద్రెంచువారు

తే. జలవిహారావసరసాహచర్యమమర
నమర కన్యాకపోల స్తనాతిచిత్ర
మకరికాపత్త్రములమాపు మాఁపువారు
నగుచు నెల్లెడఁ దార్కొనై రగవిరోధి. 62

చ. తోడఁబడ వచ్చి హెచ్చరికతో మును జన్నము లెన్ని
యేని యే, ర్పడ నొనరించు పుణ్యమున బాంధవ మొం
దిన పారుటయ్యలన్, వెడల నదల్చి యచ్చరల వెన్వెనుక
న్వగగాఁ జరించుచోఁ, బడచుతనంపుటాటల నెపంబున
వారల కయ్యె కయ్యముల్. 63

వ. అని మఱియునుం బ్రళయసమయసముచితరుచిపిచండిలప్ర
చండ చండ కిరణమండలమండలాయితమాననీయప్రతాప
కలాపధురీణులును నభినందితసౌందర్య రేఖామోఘీకృత
ప్రసవబాణులును నతినిశితకులిశధారానిరాకరణకారణప్ర
భావిభాసమానబాణబాణాసనకృపాణ పరశుపట్టిసప్రాసము
సలముద్గరప్రముఖనిఖిలసాధనప్రసాధితపాణులును ననర్ఘ్య
తరచిరంతనోదారహారమణితనుత్రాణులును నమందానంద
కందళిత సుధాబిందు సందోహ ప్రస్యందిమధురవాణులును
మానత్రాణులును నగు వీరపుంగవశ్రేణు లిరుగెలంకులందు
నేతేర రేఁచినతీరున్నం బరవకట్టి రాసమయంబున. 64

సీ. మగమానికపుతురాసాగనురాఁజెక్కిన
కలువరావన్నెపాగా ధరించి
గంబురామెయిపూఁతడంబురాజరబాబు
ఖండువా వలెవాటుగా ధరించి
చలువరాచెలువురా వపులసిద్దాత్మరా
కట్టాణి గొప్పచౌకట్లు దాల్చి
జాళువామొసలివాజముదాడుశత్రుల
గెలువ నోపెడుదానిఁ గేలఁ బూని

తే. పిలుచ నీరేడుజగములు గలయఁ దిరుగ
నరుగుదెంచిన గరుడవాహనునికరణి
నరుణిమలఁ జొక్కు హైమపల్యంకికంబు
నెక్కి యొకవొడ్డదొరబిడ్డ యుక్కు మెఱసె. 65

క. మున్నెన్నఁడు మాదృశు లిట
విన్నది గన్నయది గానివిస్మయ మిది య
న్నన్నా కన్నారంగనుఁ
గొన్నారము తమకుఁ దెలుపు కూరిమికతనన్. 66

చ. అనవుఁడు విస్మయంబును భయంబును సంభ్రమ మొక్క
వ్రేల్మిడిం, బెనఁగఁగ నెమ్మనంబునను బేర్కొను చింతల
నెంతయుం బురా, తనవపుఃపాదికృత్యములు తద్దఁ దలం
పుచు భిన్నచిత్తుఁడై, వెనుకయు ముందుఁ దోచమిని వృ
త్రవిరోధిదురాధిమగ్నుఁడై. 67

ఉ. పెచ్చుపెరుంగు నక్కజపుఁ బెంపునఁ గూరు నిలింపభర్త క
భ్యుచ్చయహేతువై తనదుపూర్వతపఃఫల మిట్లుఁ దోచె నా
నెచ్చట నుండి యెచ్చటికి నేగుచునోఁ జనుదెంచెఁ బుణ్యసం
పచ్చరితుండు చుక్క దెగిపడ్డగతిం గలహాశనుం డొగిన్.

సీ. కొమరుగాఁ బుట్టిన కుఱుఁగెంపుజీడగుంపు
బాలార్కబింబసంభ్రమమునీన
నిగురుపూఁతమిటారి జిగిఁ బూను తెలిమేను
శరదభ్రవిభ్రమస్ఫురణఁ జూపఁ
జిక్కనిపటికంపుజపసరంపుటొయార
మతితపఃఫలసంఖ్య సెళవిసంచ
ముప్పన్నెమొకముతోఁ బల్మవ్వపునడికట్టు

సౌరు శక్రాయుధచ్ఛవినిఁ దెగడ
తే. మహతినారాయణాత్మకమహితమంత్ర
వర్ణములు సారెఁ బల్కించువన్నెకాఁడు
దురముటోరెంపుదాసరి సరసగతుల
నతులవై ఖరి మెఱయ ని ట్లరుగుటయును. 69
ఉ. కప్పరపాటుతో నతనిఁ గన్గొని కన్గొనలందుఁ జాలుగాఁ
జిప్పిలు హర్షబాష్పములచేఁ బద మార్జన మాచరింపుచుఁ
ముప్పిరిఁగొన్నసంభ్రమసముద్రముద్రతఁదాల్చి పొంగిరా
నప్పరమోపకారనిధి యంఘ్రులకుం బ్రణమిల్లి యల్లనన్.
వ. అమ్మహామహుం డోడ్కొనివచ్చి నిజాసనార్ధభాగంబున నుని
చి నముచిదమనుండు సముచితప్రకారంబుగా ననిచినకుతూ
హలంబునఁ బునఃపునరభివందనంబుల నతనిడెందంబు
నానందింపం జేసి యప్పురాతనతపస్వియాననారవిందం
బవలోకించి కించిదభ్యంచితపంచమస్వరప్రపంచితవిపంచి
కారవానుకారిభూరిమాధురీధురీణవచనరచనా చమత్కా
రంబు మెఱయ ని ట్లనియె. 71
క. నారదమహానీశ్వర ని
ష్కారణ మరుదెంచినట్టి కారుణ్యసుధా
ధారానీరాకరమా
నీరాక రమాకరంబు నిక్కము మాకున్. 72
తే. దేవమునివర్య తావకపావనాంఘ్రి
జలజసందర్శనానూనసంభ్రమమున
నభిమతార్థంబు లొడఁగూడె నంతెకాదు
జన్మసాఫల్య మొదవె మజ్జాతికెల్ల. 73

తే. ఆజవంజవమాలిన్య మపనయించు
దురితములనొంచు నుత్తరోత్తరశుభాభి
వృద్ధి సమకూర్చు మీరాక వినుతిసేయ
నింక వేయేల పలుక మునీంద్రతిలక. 74

చ. అని వినయంబు దోఁపఁగ మహర్షిసమాగమనంబు మెచ్చి
హె,చ్చినకుతుకంబుచే నతనిచిత్తము రా మధురోపహారము
ల్,మునుపుగ భక్ష్యభోజ్యముఖముఖ్యపదార్థసమాదరార్హ
భో,జనమున గంధిలార్ద్రహరిచందనచర్చలఁ దృప్తిఁజేయు
చున్. 75

మ. కలకాలంబు నహర్నిశంబును భవత్కారుణ్యసంపత్తిచేఁ
గలిగెన్ స్వస్థత మాకు సార్థకముగాఁ గళ్యాణసంధాయకో
జ్వలలీలావిభవంబు లెన్నియొకొ తత్సర్వంబు సంపూర్ణతా
కలనం జెందెనొ కంటనుం గుఱు తెఱుంగన్ రానిభాగ్యో
న్నతిన్. 76

చ. వశిజనవర్య మీకెఱుఁగవచ్చు సమస్తము నైన యీచతు
ర్దశభువనంబులం గల యుదంతము మీరు త్రిలోకవేదులీ
దృశమహిమంబు మీకె తగు దేవరవారి కవేద్య మెద్ది యీ
దిశలఁ జరించు పేరు గల దేవఋషుల్ మిముఁబోల రెవ్వరున్.

చ. అని కొనియాడి యాతపసి యాత్మకు నెయ్యము దోఁపఁగా
మహా,వినయముతోడ నిట్టులను విన్నప మొక్కటి యున్న
దిప్డు మా,మనమునఁ గల్గె సందియము మానుప మీరు సమ
ర్థులౌట నొ,య్యన వినుపింతు మీకు నిదె యంజలి నెంజలి
వాపుసంయమీ.

వ. అది యెయ్యది యంటేని.

చ. ఇవుఁ డొకయక్కజంబు జనియించిన దిప్పుడు దెవ్వరంపుఁగా
ర్యవుఁ బని ము న్నెఱుంగని తెఱం గగు నిట్టిమహాద్భుతంబు
మీా, నిపుణత దక్కఁగాఁ దెలియనేరము నేరము సైఁపు
మెవ్వరో, విపులపరాక్రమక్రమ నవీనధనంజయు లిందుఁ
గ్రందుగన్. 80

క. చనుదెంచి వీటి నెల్లెడ
ఘనతరదర్పం బఖర్వకలనవహింపం
జనవరు లట్లన విడిసిరి
జనవరు లగువారి తెఱఁగు సాకల్యముగన్. 81

క. వినుపింపు మనుడు నారద
మునిచంద్రుఁడు లేతనగవు మొగమునఁ జిలుకం
దనవాక్సుధారసాప్లుతి
ననిమిషపతిడెంద ములర నల్లన ననియెన్. 82

మ. ధరణీభాగమునం దపూర్వ మగు యుద్ధం బయ్యె భీభత్సరౌ
ద్రరసాలంబనమై మహాద్భుతతమద్రాఘిష్ఠదోశ్శౌర్యభీ
కరమై పర్వుచుఁ బద్మనాయకులకున్ క్షత్రాళికిం దద్రణో
ర్వర మేను ల్విడనాడి శూరులు మహేంద్రా వచ్చి రవ్వీటికిన్.

స్రగ్ధర. ఘోరాటోపంబుమీారన్ గురుతరసమరక్షోణినన్యోన్యవై
వైర,ప్రారంభోత్పాతజాత ప్రబలజయరుషాపాటవం బేపుమీా
రన్, బీరంబుల్ చూపిక్రొంచున్ బిరుసనక ధరం జెల్లుగా
వ్రాలు శూరుల్ ,వీరస్వర్గానుభూతిన్ వెలయుదు రనఁగా వీట
నిక్కంబు దోపన్. 84

వ. ఇత్తెఱంగున ననన్యసామాన్యదార్ఢ్యజన్యం బగు నొక్క
జన్యంబు విస్మయప్రాధాన్యంబై పరంగినకారణంబున నితరే

తరనిశితకరవాలధారానిపాతనంబుల నెదురుగాయంబులం గాయంబులు వదులు జోదులు ధర్మాధర్మప్రకారంబుల ననుకరించి కొంద ఱీయమరావతిని గూర్చియుఁ బరేతపతి నికేతనంబు ననుసరించి కొందఱు ప్రవర్తించి రనవుడు నాడు కఱచి శచీజానియానంయమిపుంగవుం గనుంగొని యి ట్లనియె. 85

శా. భూలోకంబున నెవ్వ రెవ్వరికి నాపోరాట వాటిల్లె త
చ్ఛీలంబుల్ కులముల్ బలాబలములుఁ సేనాసముజ్జృంభి
తా,భీలాటోపవిడంబనంబులు జయాపేతా ప్రచారంబు ల
య్యాలంపుఁ బరుషత్వముల్ వినుట కయ్యా వేడ్క యా
నిత్తఱిన్. 86

క. యీకథ సాకల్యంబుగ
మా కెఱుఁగింపుము కృపానమగ్రకటాక్ష
ప్రాకటవచోవినోదో
త్సేకము దీపింప మౌనిశేఖర యనుడున్. 87

చ. చెఱునగ వాననాబ్జమునఁ జె న్నలరఁ మునిచంద్రుఁ డ
ప్పురం, దరునిమనంబు రంజిల సుధామధురద్రవముద్రితం
బులఁ, నిరుపముగో స్తనీస్తబకనిస్సృతచారుమరందపూర
భా, స్వరములు నైన పల్కు లతిసమ్మదలీలఁ దలిర్ప నిట్ల
నున్. 88

చ. కలవు ధరిత్రియందు పరకారు లనేకములందులో శ్రీకా
కుళము కళింగసంజ్ఞత మకురితతఁ బేర్కొను నందుఁ గల్గు
బొ, బ్బిలి యను నొక్కపట్టణ మభీష్టత మప్రతిభానుభావ

మం, జాల మగుచున్ ధరారమణిసొమ్ములపెట్టియ నా మ
హోన్నతిన్. 89

ఉ. నీలమణిప్రరోహరమణీయశిఖాపరిచుంబితాంబరో
త్తాలవిశాలసాలకలితద్యుతిరూపితదిక్తటంబు కే
ళీలసదావవన్యలవలీసుమనిర్గళదానవాంబుధా
రాలలితంబు బొబ్బిలిపురం బెసఁగున్ సుజనాభినంద్యమై.

ఉ. ఆపురిసాల మాకసము సాఁగ నభోగతి తా గమింపఁగా
నోపకఁ గాదె యవ్వలికి నూకువతోడుతఁ జౌకళింపఁ గా
నోపు నటంచు నెంచి జనితోత్సుకుఁడై తురగంబుగాఁ
గొనెన్, జాపలయుక్తమా హరిణశాబకమున్ హరి యా
త్మ మెచ్చుచున్. 91

మ. జితవారాన్నిధి నైన పీటిపరిఘం జెన్నొందు వాఃపూర మ
ద్భుతలీలన్ భుజగాధినాయకపురంబుల్ జొచ్చె నందున్ జల
ప్లుతిబాతాళతలం బొకింతయును నంభోవ్యాప్తి గాకుంట
జు, మ్మతలంబున్ వితలంబు నన్న యభిధల్ ప్రాపించుటల్
వానికిన్. 92

ఉ. వ్రాలిన యాఖనీలిమకరంబు నజాండముఁ బ్రాకి యొప్పు న
ప్ప్రోలి యనూనమానములఁ బొల్పగు మేడలఁ బెట్టినట్టి
యా, నీలపుటోడుబిళ్లల జనించిన నైల్యము జుమ్ము గాని
చో, మే లగునే యరూప మగు మిన్నునకున్ గుణాయుక్తి
జెప్పుటల్. 93

మ. విలసద్వాతవిధూతకేతనసముద్విగ్నస్ఫురద్ఘంటికాం
చలరావంబులు రేయునుం బగలు హెచ్చైచ దాపునన్
మ్రోయఁగా, నలరూదున్ ధను మూయలేమిని గదా

యస్వప్ననామంబు వే, ల్పులకుఁ గల్గుట వీటిసౌధముల
పెంపుల్ జెప్పఁగా నేటికిన్. 94

క. అన్నగరి నున్నసంపఁగి
క్రొన్ననల నమర్త్యనీలకుంతల లుత్సా
హోన్నతిఁ దాల్తురు తురుముల
నెన్నంగను బైడితేకు లివియో యనఁగన్. 95

ఉ. తెక్కలు లేని యండజవరేణ్యము లుజ్జ్వలరూపసంపదన్
మిక్కిలి విఱ్ఱవీఁగెడు సమీరణముల్ జనలోచనోత్సవం
బెక్కఁగఁ జేయు చిత్తము లమేయసుధానిధి యైన చంద్రుపే
రక్కునఁ జొక్కుచుండెడి కురంగము లప్పురిలో తురంగ
ముల్. 96

క. వేదండము లప్పురి శుం
డాదండము లెత్తి వంచుటలు దిగిభములన్
వాదునకే పిలుపుగదా
కాదే నినవెత్తి వంపఁగా నేమిటికిన్. 97

ఉ. కంటికి గూర్కు గాన రొకకాలమునందును గూటి యాస
నిం, టింటికి సత్రముల్ వెదకు హీనత కోడరు పాకవైరి
తో, జంట దొరంగ రద్దివిజసంతతు లెంతటివార లంచున
న్నింటను సౌఖ్యముల్లను మహీసురు లొప్పరు వేల్పులం
బురిన్. 98

మ. అరివర్గంబుల నొంచుపట్టు నరణాహంకారదోశ్శౌర్యబం
ధురులై ధర్మసహాయవర్తనల నెందుఁ దక్కు రాకుండఁ
గ్రు, మ్మరుచుఁ రాజకుమారసంజ్ఞతము సన్మానింపఁగా

నుందు ర, వ్వురిలో రాజకుమారు లాహవజయస్ఫూర్జత్ప్ర
తాపోన్నతిన్. 99

మ. నవతం బూను నిధానముల్ గలుగు నంతర్గర్వ సంపత్తివై
భవ మందెన్ దనగుహ్యకేశవిదితప్రఖ్యాతిఁ గానందు వై
శ్రవణుం డంచుఁ గుబేరు నెంచరు మహాసంపూర్ణసంపత్క
ళా, వివిధైశ్వర్యనిధుల్ కిరాటు లెలమిన్ వీటన్ నిరా
ఘాటతన్. 100

సీ. ఒకక్రౌంచమును గెల్చి యుబ్బి తబ్బిబ్బైన
షాణ్మాతురుని పౌరుషంబు ఘనమె
ఒకయంధకుని ద్రుంచి యుగ్రతఁ గైకొన్న
పశుపతివిక్రమప్రౌఢి యరుదె
ఒకవీరుఁ గెల్వ నోపక వీఁగిపాఱిన
హరిదశ్వుమగటిమి యబ్బురంబె
ఒకసైంధవోద్రేక ముడిపి పెల్లు నటించు
పార్థుని యాటోపపటిమ యరుదె
తే. యనుచు నభినవవిక్రమార్కావతార
సారదోస్సారనిస్సారితారివీర
వారదుర్వారగర్వాంధకారగిరులు
వెలమదొర లొప్పుచుందు రవ్వీటియందు. 101

ఆ. అంటి పొడిచి పోటుగంటు వెంబడి దూరు
వీరవరులు పురుషకారపరులు
మేరమీఱు సంఖ్య మెఱయుదు రవ్వీట
నదురుగుండె పిక్కచెదురులేక. 102

మ. ఒకయెద్దేఁగలంతనే వృషలుఁడై యుద్యద్విభూతిన్ మహా
ధికుఁడై భిక్షుఁడు రాజశేఖరుఁ డనాఁ దీండ్రించు సంపత్తిమా
మకనామాంకము లూఁది కాంచె నిల నస్మద్వృత్తు లెవ్వారి
ను,త్సుకతన్ రాజులఁ జేయ వంచుఁ బురిలోఁ జొంపొందు
చుం డ్రంఘ్రిజుల్. 103

మ. హరిణీరమ్యతఁ జూడ్కిచేత శశిరేఖాహ్లాదమాస్యంబునన్
మఱిరంభాతిశయంబు పెందొడల హేమాభ్యంచితస్ఫూర్తి
భా,స్వరమౌ మేనఁ దిలోత్తమాధికతనాసాపుష్టిచే గెల్వన
చ్చరలం గెల్చుట కెంతవింత పురివేశ్యాకామినీజాతికిన్. 104

చ. ఉపవనమండలంబులమహోన్నతులన్ సరసీవ్రజంబు తో
రపుసొబగున్ బురీనికటరాజితశాలివనీసమగ్రతల్
విపులతరాపణప్రకరవిస్తృతనిస్తులవస్తుజాలముల్
నిపుణతఁ గాంచు సత్కవుల నేర్పునఁగాని నుతింపఁ బోలునే.

వ. మఱియు నతివిమలనీరంధ్రప్రఫుల్లహల్లకకల్హారపరిమళమిళిత మధురమధురసాసారంబు లగు కాసారంబులవలనను గుసుమితలతాప్రతానవేల్లితనానానోకహవితాన బంధురగంధప్రలుబ్ధవిభ్రమద్భ్రమరసంతానంబు లగు నుద్యానంబులవలనను హరిహయాయుధప్రస్తరస్థగితహర్మ్యనిర్మలప్రభాపటలప్రణుతరాకానిశాకరకళంకంబు లగువిటంకంబులవలనను నభ్రంలిహాదభ్ర సౌధాగ్రతల పరిభ్రమ త్పురపురంధ్రీకచప్రచయ పయోధరావలోకన ప్రభూత కుతూహల చటుల నయనాపరాయణ పోషిత మయూరవర్గంబు లగు రాజమార్గంబులవలనను ననర్ఘ్యతరచిరంతనరత్న ఘుంటికాఘుణఘుణాత్కార మీంకారసంకులారవనిరంకుశాకుంచన

ప్రసారణోద్దండశుండాదండంబు లగు వేదండంబులవల నను దుములతమలడమామికాతమ్మటపటహఢక్కాహు డుక్కాప్రముఖభేరికా నినాదమేదురదురాసదప్రాంగణాసుం దరంబు లగు తత్తత్ప్రభుమందిరంబులవలనను నిజభుజాగ్ర జాగ్రన్మండలాగ్రధారానిరాఘాట విజయఘాటీసముద్భటు లగు వీరభటులవలనను నమూల్యకల్యాణపల్యాణకలితవిల యపవమానజవమానబాహ్లీక పారసీకారట్టఘోట్టాణాస మారోహణోద్వృత్తు లగురాహుత్తులవలనను వప్రస్థలస్థా పితాపరిమితశతఘ్నీకానికాయంబుసొంపునం బొంపిరివోని పెంపుమిగిలి సుధర్మాభిరామంబై యమరావతి ననుకరింపు చుఁ బుణ్యాజనేశ్వరవిరాజితంబై యలకాపురంబు తెలుంగున గరంబు రంజిల్లు నప్పురంబున కధీశ్వరుండు. 106

ఉ. రావుకులాభిమానిబుధరంజనధర్మగుణప్రధాని నా
నావసుధాధినాయకగణస్తవనీయయశోనిధాని శౌ
ర్యావసథాయమానవివిధార్భటిమద్వరసేని రంగరా
యావనిజాని పొల్పెసఁగు నాహవరంగజితారిమాని యై. 107

వ. ఏతదీయవంశానుక్రమం బభివర్ణించెద. 108

చ. పరమపవిత్రయౌ భువనపావనిజాహ్నవి గల్గెనే మహా
పురుషునిపాదపద్మమునఁ బుణ్యతమేరి బగుతన్మురద్విష
చ్చరణసరోరుహంబుననె సంభవమందినకారణంబుచే
నరయఁగఁ బద్మనాయకులు నావెలమ ల్మతిఁ గాంచి రిమ్మ
హిన్. 109

క. ఆవెలమవంశములలో
రావుకులీనులు ప్రసిద్ధరమ్యాయశశ్రీ

లావణ్యమూర్తు లగుచు ధ
రావలయం బేలుచుంద్రు రాజన్నీతిన్. 110

శా. శ్రీనాథాంఘ్రిసరోరుహాదయముచేఁ జెన్నొందుచుం బౌ
రుషా,ధీనస్వచ్ఛతరస్వజీవనకులై దీపింపుచున్నట్టి య
మ్నాన్నై కాలయపద్మనాయకులకున్ మాన్యాదిపీఠస్థులై
శ్రీనిర్వాహకులై రి వేంకటగిరిశ్రీరావురాజాగ్రణుల్. 111

సీ. అనపోతవిభుఁడు మహాపరాక్రమశాలి
గావునఁ దనశౌర్యకలనఁ జేసి
యాజిరంగమునను రాజుల నోడించి
కృష్ణానదివఱకు గెలిచి దేశ
మును దనకు నధీనముగఁ జేసికొనియె నిం
కొకపరిఁ బొసఁగిన యుద్ధమునను
దనమీఁద వచ్చినఘను లగుదొరలను
నూటిపై నొక్కని గీ టడంచి

తే. యేకవీరుం డటంచును నెన్నికఁ గనె
వేంకటగిరికుటుంబపుఁ బృథివిపతుల
లోన నాశవపురుషుఁ డామానఘనుఁడు
వెలమలకు నెల్లఁ గలిగించె విమలకీర్తి. 112

సీ. సర్వజ్ఞసింగయ జనపతి యెల్లవి
ద్యలనేర్చి తనపేరు సార్థకముగఁ
బండితకోటిచేఁ బలుకవీంద్రులచేతఁ
బరివేష్టితుం డయి ప్రౌఢి మెఱయ
విద్యావినోదిమై హృద్య మైనరసార్ణ
వసుధాకరం బనఁ బరగు గ్రంథ

ము రచించె సంస్కృతమునఁ బండితుం డని
కవివరుం డనియును గాంచెఁ గీర్తి
తే. నతఁడు వేంకటగిరివంశమందు నుదయ
మందిన వసుంధరావరులందు దశమ
పూరుషుం డయి జను లెన్నఁ బేరు వడసె
దగదె యాతనివర్ణింప జగతియందు. 113
క. అల వేంకటగిరిపురరా
జులలోఁ బదునేనవపురుషుం డగుచు మహిం
బాలిచెఁ బెదరాయఁ డాతఁడె
వెలసెను నిర్వాణరాయవిభుఁ డనుబేరన్. 114
సీ. మొగలాయిప్రభులకై పూన్కి షేర్మహామదు
ఖానుఁ డనెడుపేరు గల్గినట్టి
సరదారుఁడు మనదేశమును జయింపఁగ
వచ్చె నాతనితోడ వచ్చినట్టి
యిరువురుప్రభులలో నీతఁ డొక్కరుఁ డయి
యుండెఁ దత్కాలపుయుద్ధములను
బలుసాయ మొనరించి పాదుషావలన రా
జామనునట్టిసంస్థానము బ్రతి
తే. ఫలముగను నొందె రెండవప్రభువు విజయ
నగరరాజ్యము మొదటివాఁడుగ గణింపఁ
బడిన మాధవవర్మ యర్కబుద్ధిరేఁడు
వీరిలో బెద్దరాయపృథ్వీవరునకు. 115
సీ. సంస్థానము నొసంగు సమయంబునందె వం
శక్రమంబుగను రాజాబహాదరు

మొదలైన బిరుదులు ముఖ్యమౌ తెల్లజెం
డా నవుబత్తును ఢక్కయాది
గలిగిన రాజచిహ్నము లొసంగఁబడె నుత్త
రపుసరకారులం దపుడు పోరి
సందడి యడగ దాజనపతి కూడవ
చ్చినయట్టి లింగప్ప యనుసుతునకుఁ
తే. దనకు సమకొన్న యారాజ్యమును నొసంగి
తండ్రితాతలనాటిదై తనరు వేంక
టగిరి రాజ్యమ్మునకును దిరుగ జనియెను
బెద్దరాయ వసుంధరావిభువరుండు. 116
శా. శ్రీమల్లింగపరాయమానవపతిశ్రేష్ఠుండుసర్వప్రజా, క్షేమా
పాదకరాజ్యరక్షణ పరస్వీయాంతరంగాఢ్యుఁడై, రాముం
బోలుచుఁ దండ్రిగారివెనుకన్ రాజ్యంబు పాలించె ది,గ్భా
మాకాయదుకూలతా విభవశుంభత్కీర్తిసంపన్నుఁడై.
చ. అపుడు శ్రీగాకుళాఖ్యపురమందు వసించు నబాబు గారు త
ద్విపులపరాక్రమాతిశయ విశ్రుతలింగపరాయనాముఁడౌ
నృపమణిరంగవా కను వసీస్థలికి స్వగయార్థ మేగి శ
త్రుపటలబద్ధు నాత్మసుతుదోర్విభవంబున వారిఁ గొట్టితే
నపరిమితప్రమోదభరితాంతరుఁడై కడుసన్నుతింపుచున్.
శా. గారామొప్పఁగ నప్పు డీతనినిరాఘాటప్రతాపాఢ్యతా
ధీరత్వాదిగుణప్రపంచమునిజాం ధీగోచరం బౌనటుల్
దారాగంబున వ్రాయఁజూచియతఁడుత్సాహంబుచేనిచ్చెరం
గారావన్ ఘనపౌరుషాఖ్యఁ గులజత్మాపాలచిహ్నంబుగన్.
ఉ. అంతియొకొక రొక్కనిశనాయనగ్రామము లెన్నితోరణా

క్రాంతి వహింపఁ జేయునవి గౌరవ మొప్పఁగ శాశ్వతంబుగా
సంతస మొప్ప నాతనికిఁ జయ్యన నిచ్చెఁ దదీయపౌరుషం
బంతయునిత్యమైజగములందు వెలుంగఁగఁ జేయునూహచేన్
శా. ఆరాజన్యుఁ డపుత్త్రకుం డగుటచే నాత్మీయవంశోదయున్
ధీరున్ వెంగళరంగరాయనృపతిన్ దీనావనోదారునిన్
గారా మొప్పఁగ దత్తపుత్త్రకునిగాఁ గైకొంట నాధీరుఁడే
యారాజాగ్రణి వెన్కఁ బూజ్యగతిరాజ్యం బేలె నత్యున్నతిన్
శా. శ్రీమద్వెంగళరంగరాయవసుధాసీమంతినీశుండు సు
త్రామప్రోజ్జ్వలభూరిభోగవిభవభ్రాజిష్ణుఁ డౌచుం గృపా
భూమాన్వీతమనోంబుజాతుఁడయిసద్భూమీసురవ్రాతమున్
గ్రామాదిప్రదుఁడౌచు మోదయుతమున్ గాఁ జేసె సంప్రీతి
క. రంగపతి రంగరాయనృ [చేన్
పుంగవుఁ డోకఁ డతనిసుతుఁడు భూరితరశ్రీ
రంగపతి భక్తపరుఁడై
మంగళగతిఁ దంష్ట్రికరణి మహిఁ బాలించెన్. 123
క. కాయజతులితాకృతియున్
ధీయుక్తివిశేషవిజితధిషణోన్నతియున్
రాయఁ డపరంగరాయా
ఖ్యాయుతు నొకసుతు నతండు గనె సుకృతమునన్. 124
క. అఘనుఁడు విష్ణుపదకల
నాఘటితనిజాత్ముఁ డగుచు నైజవసుశ్రీ
మోఘితకవిదారిద్ర్యని
దాఘోన్నతి యగుచుఁ జిరము ధరఁ బాలించెన్. 125
క. ఆపార్థివుఁ డనుతుండై

భూపాలననిపుణుఁ డైన పూర్వోక్తశ్రీ
గోపాలకృష్ణరంగ
క్ష్మాపాలకు దత్తపుత్త్రుఁ గా జేసికొనెన్. 126

తే. క్షితితలంబున గోపాలకృష్ణరంగ
రా వటంచును మఱి రంగరా వటంచు
నామముల రెంటిచేత నాభూమినాయ
కాగ్రగణ్యుండు మిగులఁ బ్రఖ్యాతిఁ గాంచె. 127

క. అతఁ డినుఁ డయ్యును గువలయ
హితుఁ డగుచున్ రాజనామ మెసఁగియుఁ బద్మా
దృతి యగుచుఁ దాను ఘనుఁ డై
క్షితి మెలఁగుచుఁ జిత్రరీతిఁ జెలఁగుచు మఱియున్. 128

సీ. తనభుజాదండాసి ధారామహోరాహు
వరిరాజతతుల వెన్నంటి మ్రింగఁ
దనసముద్దీప్తప్రతాపసహస్రాంశుఁ
డహితాంధతమసమ్ముఁ గుహలఁ జొనుపఁ
దనకీర్తికుముదబాంధవుఁడు శాత్రవలోక
ముఖపంకజముల సొంపులు హరింపఁ
దనదృఢాజ్ఞావేల మొనసి ప్రత్యర్థిభూ
పతిసముద్రంబులఁ బట్టువఱప

తే. నహుష నల రంతి సగర మాంధాతృ పూరు
పృథు భగీరథ శశిబిందు విక్రమార్క
ధర్మతనయుల మఱపించి ధరణి నేలె
రమ్యగుణజాలముల ప్రోవు రంగరావు. 129

తే. మన్నహంవీరపెరమన్న మదవిభాళ

గాయగోవాళబిరుదవిఖ్యాతిధనున
కమ్మహీజాని కనుజన్ముఁ డై తనర్చె
రావుకులహేళి వెంగలరాయమౌళి. 130

క. ఇంద్రోపేంద్రులకై వడిఁ
జంద్రార్కులపగిది రామచంద్ర సుమిత్రా
చంద్ర ముఖజులక్రియ ని
స్తంద్రత వెలయంగ నందుదారక్రీడన్. 131

తే. అగ్రజుం డైనరంగరాయావనీంద్ర
చంద్రునిసాహసౌదార్యసద్గుణములు
వినయధర్మప్రజానుపాలనవిధములు
పెద్ద లగువారి దెలుప నప్రియముదొట్టి. 132

సీ. ఆమన్నెకొమరుని యభినవసౌందర్య
వీరప్రతాప సద్వృత్తి యరసి
యాపద్మనాయక క్ష్మాపాలతిలకుని
ప్రకటితసప్తాంగపటిమ నరసి
యావెల్మదొరబిడ్డ యప్రతీపవిచార
పంచాంగనిర్ణయప్రౌఢి యరసి
యారావువంశపయఃపయోధిసుధాంశు
చతురుపాయజ్ఞానసరణి నరసి

తే. చాల దనలోనఁ జూపోపఁజాల కునికి
నిర్నిమిత్తవిరోధంబు నెఱయ నెఱయ
రయనముద్విగ్నరోషాగ్ని రవులుకొనుచు
డెందమగలింపదుర్వ్యథామందుఁ డగుచు. 133

తే. రావుకులజన్ముఁ డగురంగరావుపేరి

గొప్పమగమానికపుఁబూన యొప్పిదమున
కాత్మసామ్రాజ్యవైభవం బక్కటకట
వెదకికొన గాజుపూసపాటిది యటంచు. 134

తే. భాగ్యసంపన్నుఁ డగు పూసపాటివిజయ
రామరాజును నొకదొడ్డరాచబిడ్డ
యనుదినంబును రంగరాయక్షితీంద్రు
పెంపుమది నించుకేని సైరింపలేక. 135

వ. ఇట్లున్నంత. 136

సీ. గుఱిదప్పకొకట నేగుర నార్గురను నొంపఁ
గలయలగోల్తుపాకులబలంబు
కోట్లల నడఁచి గగ్గోలుగాఁ బడఁగ్రుమ్ము
వేబారుటీటెల వెలమగుంపు
టెక్కెమొనల్ గాచి ఱిక్కవైచిన డాగి
తెఱపులు వఱపెడు తేజిపౌఁజు
నూటికొక్కఁడె చాలి మేటిమగంటిమిఁ
గాలుద్రవ్వుచు నుండు కాలిమూఁక

తే. యద్దిఱా వీని కెద్దిరా నుద్దియైన
జోదువివ్వత్సుఁ డొకఁడేమొ చూడ ననుచు
నివ్వెఱఁగుఁ గాంచి పైనెత్తి చివ్వకెదుగ
నోప నేరని కడిమిమై యుండునంత. 137

శా. ఢిల్లీపాదుషహానియోగమున రూఢిన్ రాజరాజో నిజా
మల్లీపేరటి మేటిసాహెబు సుభాయాత్మం గళింగంబు రా
జిల్లన్ ఘనుఁ డాఫరాసునకు మూసాబూసి యన్వాని క

త్యుల్లాసంబున నాధిపత్య మొసఁగన్ యోజించి రావింపు
చున్. 138

ఉ. భాస్కరసన్నిభుం బయిన భవ్యతరస్ఫురణాభినంద్యవ
ర్చస్కతగల్గు నీకు నతిసాహసశీలునకుం గళింగస
ర్లస్కరు భార మిచ్చి శుభలక్షణలక్షితుఁ జేసిపుత్త్ర శ్రే
యస్కర మిట్టికార్య మని యాదరపూర్వముగా వచింపు
చున్. 139

వ. అప్పు డప్పురాసులజేనికి నుత్తుంగతురంగమాతంగంబులు
మొదలుగాఁ గొన్ని యుపాయనంబులు నుద్ధతులముల్కుగ
జఫరజంగుసిఫహాసరదారుగా రనియెడి దొడ్డకితాబులు నొ
సంగి యతనికిం దగిన సంగడిగా హైదరుజం గనియెడు
యవనపుంగవుం బ్రధానత్వంబునకుం గుదురుకొల్పి మఱి
యును. 140

మ. తరవుల్ పాలన సేయుచుండునెడలం ధర్మప్రకారంబు సుం
దరమై పర్వఁగ నచ్చటచ్చటిజమీందారుల్ దివాణాన కొ
ప్పరులై గ్రమ్మర సీమలెల్ల ఖరదాబాదాను గావింపుచున్
సరకారర్థము దస్తు సేయుఁడు ఖజానా నింపుఁ డింపొంద
గన్. 141

మ. అని రాజ్యప్రతిపాలనానుగుణవాక్యంబుల్ నిజామల్లినాఁ
జను సర్వాధిపుఁ డానతిచ్చుటయు మూసాబూడి వల్లే
యటం, చను దా హైదరజంగుతోఁ జనఁ జమూస్తోమం
బుతోఁ బైన మ, య్యేను లెక్కింపఁగ రానిరాజనము
పెంపెక్కం గళింగానకున్. 142

వ. తత్కాలంబున. 143

సీ. దిగ్గజంబులనైన దివులు గొల్పెడు బృంహి
తధ్వనుల్ నెఱపు దంతావళములు
వాసవాశ్వమునైనవడిఁ జూపి లంఘించి
తోఁకఁ ద్రొక్కఁగ జాలు తురగతతులు
మంథానగిరినైన మాయున్నతముతీరు
గలదె నీకను శతాంగములగములు
సేనానినైన నాసీరమ్మున నెదిర్చి
తప్పులు వెదకు పదాతిచయము
తే. ఘనతరోల్కానికాయముల్ గ్రక్కఁ దివురుఁ
బారు దీర్పఁగ నగునరాబా తెఱంగు
మందుశకడాలుగుంటి స్వామానుబంప్లు
చెకుముకి తుపాకి సాంబకు కౌతుకము నెఱప. 144

సీ. సాహసోద్ధతమూర్తి జంద్రాల్మహమ్మదు
హుస్సేన్సయూరనా నొప్పు నతఁడు
మోక్షీకృతారిలాడూఖాన్కమండమః
పటుతరాభిఖ్యఁ గన్పట్టు నతఁడు
బహుయుద్ధములఁ బేరువడ్డ విక్రమశాలి
సిద్దిబిలాలునాఁ జెలఁగు నతఁడు
శూరాగ్రయాయియౌ జోదుజానూఖాను
మిర్జా యనెడిపేర మెలఁగు నతఁడు
తే. మఱియు హాసనల్లిఖానుఁ డన్మానధనుఁడు
మొదలుగాఁ గల్గుసరదారు లెదుట నిల్చి
వేలకొలఁదుల జీరాగుజాలతోడ
నిరుగెలంకులఁ దనుఁ గొల్వ, నేపు మిగిలి. 145

శా. మూసాశబ్దము పూర్వమందు మొలఁగెఁ ముఖ్యుల్ సజాతీ
యులౌ, లాసూమ ర్తైనుదొమ్మిలీరువిపులాంలస్సేనుకుప్లాంకు
వే, మాసూనాములు వానిఁ జేరి రతిదుర్గానుల్ జిరాకూ
ర్పు మి, న్నానసన్నంపు బనాతుపింజరుల సౌన్నాపాలకీ లె
క్కచున్. 146

మ. సమరోజ్జృంభితశౌర్యధుర్యు లగు సార్జంతుల్ మయూరుల్
కుమం,దములఁ వీరులు సోలుదారులు సుబేదారుల్ మొద
ల్గల్గుసై,న్యము లాత్మీయులు గొల్వ నుద్ధతుల ముల్కాఖ్యా
మహాఖ్యాతిమ, త్సముదగ్రప్రతిభావిభాసి యగు మూసా
బూసి యుల్లాసిల్లె. 147

వ. వెండియుం బ్రచండదోఃపాండిత్యంబునం జాఱుకుగల షుకు
రుల్లాప్రభృతిఖానువర్గంబులును ఛత్రపతిరామచందురుప్ర
ముఖు లగు రజపుత్రులును నాగోజీరాయపురోగము లగు
పండితప్రకరంబులును సమరసన్నాహదోహళంబు లగు
కాహళంబులును గర్జాసమూర్జితవిరావంబునకుం దానకం
బు లగునానకంబులును దూరీకృతశీతవాతోష్ణవృష్టిప్రచా
రంబు లగుపటకుటీరంబులును భారవహనక్రమవిక్రమంబు
లగుక్రమేళకంబులును నీలపీతారుణాదిభావడంబరాంబరతల
చుంబిత పటపటత్కృతిచంచల నిజాంచలప్రభూత నూతన
వాతనిర్ధూతజలభృజ్జడంబు లగుసిడంబులును సమస్తవస్తుసం
భారభరణధురీణంబు లగు నాపణంబులును దక్కంగల
సామగ్రియుం దనదండంబున కమందానందంబు నంధిరప
గందళితహృదయారవిందుండై ఫరంగులదొర కళింగన

స్కారుభరంబుఁ బూని షహరు వెడలి కతిపయప్రయాణం
బులం జనిచని. 148

ఉ. రాజమహేంద్రపటణ విరాజదదూరతలంబునన్ సము
త్తేజిత మైన గౌతమనదీతటసీమను గోటిలింగవి
భ్రాజిత మైన యొక్కనవపాదపమంజుల నిష్కుటస్థలీ
రాజితలీలఁ జేరి శిబిరంబువడిన్ విడియించె వేడుకన్. 149

సీ. అచటిలేమావిమోకాకుఖాణాదిను
పులుగులరొదలు విందులు ఘటింప
నచటిపుప్పొడితిన్నె యలరారు క్రొవ్విరి
తేనెవాకలరాక దేఁటలీన
నచటియేడాకులనంటిచెట్టులఁ బుట్టు
కపురంపుఁజిదురుపల్ గన్నుఁ దనుప
నచటియేటికరళ్ల నలరు దమ్ములమీఁతి
కమ్మతెమ్మెరతావి ఘుమ్ము రనఁగ

తే. మంచిచెంగావిమే ల్మాకమాల్కనాతు
కుట్టుసొగ సుట్టిపడఁ దీర్చి కట్టినట్టి
రాంకవమ్మైనయొకగుడారంబులోన
సిఫహాసరదారుగారు వసించి యుండి. 150

ఉ. కారుణికత్వ మేర్పడ శ్రీకాకుళపుంసరకారులో జమీ
దారుల రామరాజవసుధావలయేశ్వరముఖ్యుల న్ముదం
బారఁగఁ బిల్వఁ బంపు మవి హైదరజంగున కానతీయఁ ద
చ్చారవచక్రమంబునకు సత్వరుఁడై పిలిపించె వారలన్.

ఉ. పాయనివేడ్క విద్విషదపాయకరాయతబాహుశౌర్యా
పాయకరాయఁడున్ గిమిడిపట్టణపుం బృథివీశ్వరుండు నా

రాయణ దేవుఁడుఁ నరసరాజు మఱింగొలుగొండమన్నెపుం
రాయఁడు నాదిగాఁ గలధరావరు లందఱు వచ్చి రత్తఱిన్.

తే. ఉద్ధతులముల్కు సందర్శనోత్సుకత్వ
మాత్మఁ బెట్టాడ నాడాడ నలరు మన్నె
దొరలు వచ్చి రమానుషదోఃప్రసంగ
కలితుఁ డగు రంగరాయఁ డొక్కరుఁడె దక్క. 153

సీ. నిజభుజాదండనిర్ణిద్రకోదండంబు
గాండీవిగార్ముకక్రమముఁ జూపఁ
జరమభాగస్ఫురచ్చటులతూణీరముల్
గవదొనసొంపు సంఘటిలఁ జేయ
నాసీరముఖరనానాశాంఖికధ్వనుల్
దేవదత్తారవోద్వృత్తిఁ దెలుప
సూరెలఁ బఱతెంచుజాలమతీ తేజీలు
ధవళాశ్వములమస్తుద్రస్తరింపఁ

తే. గలియుగార్జునుఁ డొర యీాఘనుఁ డటంచుఁ
దనుజగర్జన మెన్న నుద్ధతులముల్కు
వీక్షణాపేక్ష నేతెంచె విజయరామ
రాజరాజన్యలోకమార్తాండమూ 154

వ. ఇట్లరుగు దెంచునవసరంబున. 155

సీ. సౌవర్ణకలశముల్ సవరించినవిలాత్రి
సకలాతిహాదాలసామజములు
జిలుగుచీనాపట్టుచెంగావిచెఱఁగుల
నిద్దాజరీనిశానీలకరులు

గడలికరళ్లచప్పుడుల నారడిసేయు
గొప్పునగారాల కుంజరములు
నజగరప్రతిమంబు లగు కంచుషుతురునా
ళములు బన్నిన జిరాసమదగజము
తే. లన్నియున్నియు ననరాక చెన్నుమిగిలి
తెగలుగా గొల్వవచ్చి యెంతేనివేడ్క
మానితము లయ్యె నారాచతేని కెదుట
నంతకంతకుఁ గనుదోయి కబ్బురముగ. 156
తే. అర్జునఖ్యాతిరాముశౌర్యాతిశయము
రాజభోగంబు మెఱయ నారాజవహాళి
విశ్వవిఖ్యాతిఁ గాంచెను విజయరామ
రాజనామంబు తనకు సార్థతవహింప. 157
సీ. చక్కనిసన్నంపుజరబాబుగవిసెనల్
జాలఁ జొప్పడు జెజాయీలబారు
మందుఘట్టనలవలందు బాజునయించి
చాలు దీర్చిన ఫిరంగీలదారు
ఫన్నాసరీవజాతాప్తాముసుంగుల
నోలి గన్పడు రేకలాలబారు
జానకీ త్రాళ్లకృశానుకీలలఁ జేర్చి
కేల నూఁదిన తుపాకీలబారు
తే. మేర మీఱినకొలఁది సమృద్ధలీలఁ
బూసపాట్యన్వయాబ్ధిరాకాసుధాంశు
మౌళిఁ జూపట్టఁ జూడ్కి కమూల్యమైన
నిబిడతరనిర్భరానందనియతిఁ దెలిపి. 158

శా. కాజాలూడ్చి ఖలీనవల్గనకశాఘాతోరుసంజ్ఞాదులం
దేజీలన్ దుమికింపుచున్ గరములన్ ధీరుల్ గమానుల్వగం
బ్రాఁజుల్ గట్టి సహస్రసంఖ్యలు శిలేబత్తర్లతో వచ్చి రా
రాజన్యోత్తముచిత్త మొప్ప మిగులన్ రావుత్తు లత్యు
న్నతిన్. 159

సీ. పొలుపొందఁ గాకర్లపూడి జగన్నాథ
రాజుగా రొకకొంతపౌఁజుతోడ
సత్యవరపుపురస్వామియగా నలరామ
భద్రరాజొకకొంతబలముతోడ
ఘనయశోనిధిముఖికాశీపతిక్షమా
ధవమౌళి యొకకొంతదళముతోడ
నలఘువిక్రముఁడు జింతలపాటినీలాద్రి
రాజుగా రొకకొంతపౌఁజుతోడ

తే. విజయరామరాజక్షమావిభునిమ్రోల
నేత్రపర్వం బొనర్చిరి నిజభుజాభు
జంగరసనాయమానప్రచండనిశిత
మండలాగ్రప్రభావళుల్ మెండుకొనఁగ. 160

శా. శ్రీరంజిల్లు కడానిపైడిజలతారీమాహురీకెంపుటం
బారీయేనుఁగు నెక్కి పెక్కులు మదేభంబుల్ దనున్ గొల్చి
రాఁగా రూఢిన్ జతురంగసైన్యములతో గర్జిల్లుచున్ వత్స
వాయీరాయప్రభుమౌళి వచ్చెఁ గడు రాజీక్షించి హర్షిం
పఁగన్. 161

మ. జగ మొక్కుమ్మడిఁ గ్రమ్మఁ జాలెడు మహాసత్వంబుచే నొప్పు
గొప్పగుజాలాత్రితులు గైతలొట్టియలు శోభాస్ఫూర్తిఁ

దన్గోల్వమో,దుగులింగావనిభర్తరాజమణి సంతోషిల్లఁగా
వచ్చెనొ,క్కగజోత్తంసము నెక్కు చొక్కమగు నుత్కం
ఠాతిరేకమ్మునన్. 162

శా. ధన్యాటోపులు మందపాటికులరత్నంబుల్ మహారాజమూ
ర్ధన్యుల్ శ్రీరఘునాథరాజబలభద్రక్ష్మావరుల్ మున్ను సౌ
జన్యక్రీడలఁ బొఱుదెంచి శిబికాచంచద్గతుల్మీఱ రా, జన్య
గ్రామణి కిచ్చి రుత్సవముఁ దత్స్వాంతంబు కాంతంబుగన్.

చ. నలువదివేలకాల్బలము నాలుగువేలతురంగమంబులున్
నలువదియేఁబదేనుఁగు లనంతములైన శతఘ్నికాచయం
బులు నొకవేయులొట్టియ లపూర్వవిభావిభవంబుఁ దెల్పు
చుం,గొలువ ఫరాసుతేనిఁ గనుగొఁ జనుదెంచెను రాజతి
త్వరన్. 164

వ. ఇట్లు మిన్ను మెఱసి యనన్యసామాన్యసామ్రాజ్యధురంధ
రుం డగు నారాజపురందరుండు గంధబంధురసింధురస్కం
ధం బధివసించి విచిత్రముక్తాతపత్రప్రముఖరాజలక్షణాలక్షి
తుండై సపరివారంబుగా నరుగుదెంచునప్పుడు. 165

తే. దుర్నిమిత్తంబు లొకకొన్నిఁ దోచె నెదుట
దానభావ్యర్థసూచకంబౌ నటంచు
నెఱిఁగి యెఱుఁగక వర్తించి రెందఱేసి
కారణము దీర్పఁబోల దెవ్వారికైన. 166

శా. ఆసన్నాహవిజృంభితస్ఫురణచే నారాజచంద్రుండు కై
లాసక్ష్మాధరతుంగశృంగగతలీలాకందరం బంచితో
ల్లాసప్రౌఢిమడిగ్గు సింగముక్రియన్ లావణ్య మింపొదఁ గ్రీ
డాసన్నాహసముజ్జ్వలద్గజమువేడ్కం డిగ్గి యల్లల్లనన్. 167

సీ. నిశితాసిపాణులై నిలిచి శిఫాయీలు
పేరిమతో మ్మాని సలాము సేయ
నానమ్రమణిమకుటాంశుమాలికలతో
సామంతనృపులు సాష్టాంగ మెరఁగఁ
గలధౌతమయకనఝ్ఝసవేత్రములవారు
బలసి ముంగల బరాబరులు సేయ
వందిమాగధులు కైవారముల్ ప్రకటించి
కొమరైన బిరుదుపద్యములు చదువ
తే. మదవదైరావతముమాడ్కి మందమంద
గతుల నడతెంచి వచ్చి యుద్ధతులముల్కు-
గారి సందర్శన మొనర్చి గాఢవమున
కౌఁగ యొక్కింతలేక యారాచపట్టి. 168
తే. దర్శనానంతరంబునఁ దత్తదుచిత
బహుబహూకృతు లొదవె శుంభన్మదేభ
శోభమానాంశుకాదికలోభనీయ
రాజితోపాయనములు బరస్పరంబు. 169
ఉ. అంత ననంతసంభ్రమసమంచితమైన మనంబుతో ధరా
కాంతుఁడు దంతపుఁబని చొకాటపు నీటిమెఱుంగు గెంపు
రా, దొంతరవింతసంతనలతోఁ దగు పాలకి నెక్కి వచ్చి ని
శ్చింతమెయిఁ నివేశనము జేరె వఱిఁ దివిటీలవెల్గునన్.
సీ. గుబ్బెత లందిచ్చు గోదావరీనదీ
స్వాదూదకంబుల జలక మాడి
శారదచంద్రచాంద్రీరోచిరుద్వాహ
దములైన ధౌతవస్త్రములు గట్టి

యభిమతభక్ష్యభోజ్యాదికాహారమ్ము
లా ప్తవర్గములతో నారగించి
నటనటీగాయకనానావినోదప్ర
సిద్ధప్రసంగముల్ జిత్తగించి
తే. రాయభారులు దెలుపువార్తలు గ్రహించి
యొక్కచోక్కంపురాకుటి నుక్కుమిగిలి
నిదుర వాటించి మరునాఁటియుదయకాల
కృత్యములు దీర్చి కొలువు సాగించి యుండె. 171
చ. సరసగుణాభిరామ మురశాసనభక్తివిశేషధామ సా
గరతనయాకటాక్షపరికల్పితవైభవగేహసీమ ని
ర్భరరుచితీవ్రధామ పటుపౌరుషభార్గవరామ పార్థివో
త్కరసవసోమ పండితవితానగృహాంగణకల్పకద్రుమా. 172
క. ఆచక్రవాళశైల, క్ష్మాచక్రనృపాలజాల సమ్మదకరలీ
లాచతురకీర్తిపూరా, యాచకమందారమన్న హంవీరవరా.
ఉత్సాహవృత్తము. అనతవైరి లోకదర్పహారిభూరివిగ్రహా
ధనదనందనానురూపతరుణరూపవిగ్రహా
ఘనదయారసానురాగకలితవాగనుగ్రహా
మనుపమాననయభృతక్షమావధూపరిగ్రహా. 174
గద్యము. ఇది శ్రీమత్కాశ్యపగోత్ర దిట్టకవివంశ పవిత్రాచ్చ
నామాత్య పౌత్ర•పాపరాజకవిపుత్ర శ్రీరామచంద్ర చర
ణారవింద ధ్యాన పరాయణ నారాయణాభిధానప్రధాన
మణిప్రణీతం బైన రంగారాయకదనరంగచరిత్రం బను
మహాప్రబంధంబునందు ప్రథమాశ్వాసము.

---

శ్రీరస్తు.

శ్రీహయగ్రీవాయనమః.

---

# రంగారాయచరిత్రము

## ద్వితీయాశ్వాసము.

---

క. శ్రీజానకీంద్రచరణాం
భోజాతాయత్తచిత్తపుష్పంధయఘో
రాజిస్థలీజితాహిత
రాజన్యచమూనికాయరామారాయా. 1

వ. అవధరింపు మనంతరకథావిధానం బెట్లు జరిగె నని యని మునీశ్వరుండు దివిజకర్షంది నడుగుటయు నతం డతని కి ట్లనియె. 2

చ. గజఘరజంగుదర్శనవికాసితచారుముఖారవిందుఁడై
నిజపరివారవారపరిణీతమహాకుతుకంబుతో ధరా
భుజతిలకంబు సొం పెసఁగెఁ బుంఖితనైజమయూఖపుంజాల
వ్రజపరివేష్టనాధిగతవర్ణ్యరుచిస్ఫురదర్కవైఖరిన్. 3

సీ. ఒకవంక నాప్తరాజకుమారసంతతుల్
సరససల్లాపముల్ సలుపుచుండ
నొకవంక రాజకార్యకళావిశారదు
లగుప్రధానులు రహస్యములు దెలుప

నొకవంకఁ గోవిదప్రకరముల్ నిరతంబు
ఘనతర్క-శాస్త్రింబు లనువదింప
నొకవంక నిపుణవై ణికవాంశికనికాయ
గాయకు ల్గానసంగతులు నలుప
తే. నోలగం బుండి తనలోన నూహఁజేసి
యతిథయావనాయవనసభాంతరస్థ
జనమనోహారభూరివచఃప్రసంగ
శీలు నొక్క-వకీలు నీక్షించికొనుచు. 4
క. యావనసభాంతరంబుల
నీవు బహుప్రౌఢి మెలఁగ నేర్పరివి వచః
ప్రావీణ్యశాలి వని సం
భావింపుచు రాజకార్యఫణితిం బలికెన్. 5
చ. యవనజనావతంస మగు హైదరుజంగు కచేరికిఁ జేరి నీ
వివిధవచోవిచక్షణత వేడుకఁ గొల్పఁ గళింగసీమతోఁ
దవిలిన రాచకార్యము యథావిధిగాఁ బయికంబుతో నిఖా
వివరణఁ జేసి మాకు సెల వింపని తెల్పుడుఁ జేసి వెండి
యున్ 6
శా. ముందెల్ల ప్పటికిం గళింగమునకుం మోతాదుగాఁ గజమా
బందీద్వాదశలక్షరూపికల కేర్పాటున్నదా చొప్పు సెం
పందర్ సా మిపు డిచ్చి పుచ్చెదము పర్యాయంబునన్
సాము విూకుం దోడ్తోడన మీరు లేచి తిరుగా గోదావరిం
దాఁటినన్. 7
క. అని రాజ యసంగతు
లనుభవడం బేటపఱచి హైదరుజంగుం

గని పునరుత్తరములు వేఁ
గొనిరమ్మన రాయభారి గొబ్బునఁ జనియెన్. 8

మ. చని యారాజశిఖావతంసము సమంచత్ప్రీతిఁ దర్శింపు ని
ప్పని తీరు ల్సరకారుతోఁ గలజమాబందీవిచారంపు జో
ప్పును దన్నిష్కృతియుఁ దదర్థనియమంబుల్ సమ్మదస్ఫూ
ర్తి నొ,య్యన నాహైదరుజంగుసాహెబున కాద్యంతం
బునుం దెల్పినన్. 9

ఉ. హైదరుజంగుసాహెబు రయమ్మున నిట్లనియెఁ వకీలుతో
నాదర మొప్పఁ బైకమున కైనవిచారము లేటికమ్మ దీ
నాదరగా మొలాజుమతునామది రంజిలుఁ దద్రిరంస నే
కా దనరా దనశ్యము శ్రీకాకుళ మానఁగ వత్తు మిత్రతిన్.

తే. ఇవ్విధంబున నానతీ నవ్వకీలు
లు మలిపిన ప్రతిమనుబోలి మరలి
రాచబిడ్డకు విన్నపం బాచరించెఁ
బెనచి హైదరుజంగు వల్కిన తెఱంగు. 11

శా. ఆవార్త ల్విని రామరాజవసుధాధ్యక్షుండు కౌటిల్యచే
ష్టావైదగ్ధ్యము మానసాబ్జమునఁ దోఁటన్ సాహెబుం గొం
చుతా,నావిర్భూతమనోవికారగతిఁ బర్యాయంబునం బుట్టు
శో,భావృత్తుల్ గనలేక బొబ్బిలిగడీ పైడించు దుశ్చేష్ట
తోన్. 12

శా. మీతోఁ గొంత ప్రసంగసంగతికి నెమ్మిన్ ముచ్చట ల్సేయఁగా
జేతఃప్రీతి జనించి యున్నయది మీచిత్తంబునం దెట్లయ
ట్లే తేజంబున నందు నన్నియును సందేహంబు లేదిందు నేఁ
బ్రాతఃకాలమునం దెవచ్చితమతో భాషించెదన్ సర్వమున్.

చ. అని పునరుత్తరంబులు దదాత్మకు హర్ష మెలర్ప దూత నొ
క్కనిఘను నంచియుంచితవికాసమున న్నిదురించి లేచి ప్రా
గ్దునఁ జని యాప్తవర్గములతోఁ బొడగాంచి యథేష్టగోష్ఠివ
ర్తనలఁ దురుష్కనేతకు ముదంబొదవం దగురీతి నుండుచున్.

వ. తనయంతరంగంబునం బొడమిన యన్యాయసూచకాసూ
యావిశేషంబునకు నశేషంబునకు ననుకూలంబుగా నస
హ్యాజనకంబు లగు నుత్తరంబు లయ్యవనపుంగవునకుం గ
అపువాఁడై ప్రసంగవశంబున. 15

ఉ. భూరితరాభిరమ్యరుచిఁ బొల్పగు నూసరకారులో జమీ
దారులు వెల్గువారు భుజదర్పసమాహృతవైరివీరభూ
మీరమణీమనోరమణమేదురరాజ్యరమాంగనామణీ
వారపరిష్క్రియుల్గలి రవార్యులు బొబ్బిలిపట్టణంబునన్. 16

సీ. పాండవేయులభుజాపాండిత్యసామగ్రి
కార్తికేయుని పరాక్రమసమిష్టి
గంగాతనూభవురంగత్ప్రతాపంబు
హరునిదోశ్శౌర్యమాహాత్మ్యకలన
విక్రమార్కునిభూరివిక్రమప్రక్రియ
సంకర్షణుని మహాసాహసంబు
కార్తవీర్యార్జునుకలితబాహాశక్తి
పరశురాముని యుగ్రపౌరుషంబు

తే. ప్రమదమున సంగ్రహించి శూరప్రపంచ
కల్పనాకల్పచాతురి గానుపింప
నంచితప్రౌఢిమమున నిర్మించఁబోలు.
నలిలభవసూతి బొబ్బిలివెలమదొరల. 17

తే. ఉగ్రనరసింహమూర్తులై యొప్పువారి
సాహసమ్మున కన్యరాజన్యసమితి
రహి వహింపక యున్నె హిరణ్యకసిపు
లీల లేక నేల దచ్ఛౌర్యశీల మరయ. 18

తే. అంబరమణిప్రభావపిడంబనంబు
ఘనతరోజ్జృంభితప్రభాకరనిరూఢి
వెలయఁ జూపట్టువా రౌట వెలమవారు
పద్మనాయకు లౌట స్వాభావికంబు. 19

శా. గారా మొప్పఁగ దాదు లుజ్జ్వలరసాంకప్రౌఢిదోశ్శౌర్యపుం
బీరం బాతని కుగ్గుతోఁ బెనచి త్రావింపంగ బోల్పిన్ననాఁ
డారూఢి న్సహజప్రతాపనిధు లాహా వెల్మవా రందు రం
గారాయప్రభుసాహసం బెసఁగు బంగారంపునెత్తావియై.

ఉ. భండనభీముఁ డార్యజనబంధుసముద్రుఁడు భాగ్యవైభవా
ఖండలతుల్యుఁ డర్థిజనకల్పమహీజము భూపలోకమా
ర్తాండుఁడు వైరివీరభటదర్పవిదారణబాహువిక్రమో
ద్దండుఁడు రావురంగవసుధావరుఁ డాతని నెన్న శక్యమే.

తే. అతనిఁ గొల్చిన కమ్మకట్టైనబలము
బలమురాంతక గాంగేయపాండవేయ
కార్తికేయ రఘూద్వహ కార్తవీర్య
జామదగ్న్యాదికాంశాభిజాత్యసరణి. 22

మ. అకలంకస్థిరధైర్యనిర్మథితమంథావార్యుఁ డైనట్టి రా
వుకులాగ్రేసరు సన్నిధానమునఁ జెల్వొంజూప నొక్కొక్కఁడే
వకుఁడే చాలును ఖాన్సహేలఫన్నుఁజు ల్వాంచించితే ఘోటక

ప్రకటాటోపము మీటెఁబుచ్చుటకు దృప్యద్దోర్విలాసంబునన్.

సీ. కరుగునఁ బోసెనో ఘనభుజాపాండిత్య
భావంబు సవర్ణించి యావిరించి
గనిగాఁగఁ జేసెనో గాఢవిక్రమకళా
కౌశలప్రాప్తి యొక్కంటఁ గూడి
మొలక లెత్తెనో రసాతలవలత్ఫణివాంత
విషవహ్నికీల లుర్వికిని వెడలి
పద్మనాయకులరూపములఁ గైకొనియెనో
నారాయణుని సహస్రారధార

తే. దారుణాటోపదీపితోద్ధత్యు లగుచు
బొబ్బిలిపురస్థలమ్మునఁ బుట్టఁగన్న
వెలమకొమరులవడి యెన్న నలవి యగునె
నలువకైనను వేనోళ్ల చిలువకైన. 24

శా. రంగారాయనృపాలసోదరుఁడు ధైర్యస్థైర్యమంథాద్రియౌ
వెంగల్రాయఁడు శౌరుటీకెఁ గొని దోర్వీర్యంబునం దూ
గినన్, గంగానందనుఁ డైనభీముఁడయినన్ గాండీవియైన
న్వడిన్, భంగం బొందరె ఘోరవీరరణభూభాగంబులన్
వ్రేగుగన్. 25

సీ. చెలికాని వెంకయ్య యలఘుదోర్వీర్యంబు
ధనదుని చెలికాని దాఁటనోపుఁ
దాండ్రపాపయ్యప్రతాపనైపుణ్యంబు
పెల్లురాచతాండ్రల పెంపు డింపుఁ
దామరదమ్మభూధవుఁడు మార్తురమోము
దామరసిరుల చెందము లడంచుఁ

గాకర్లపూడి వేంకటరాయభూజాని
యనువొందఁ జయలక్ష్మి కాకరంబు
తే. ముత్తియము లెల్ల నొకచోట మొత్తినట్లు
మగఁటిమిఁ జెలంగు వెలమ లామన్నెపిన్న
వాని బొబ్బిలికోటలో వన్నె మెఱసి
యున్నవా రింక వేయేల యోనవాబ. 26

క. ఆబొబ్బిలిగడిపై తెర
గాబురుజులపై నెసంగు నాగ్నేయకళా
శ్రీబదయోమయమైన య
రాబాసాం పెన్న నెన్నరా దెవ్వరికిన్. 27

సీ. క్రొవ్వాఁడి వసియార్పుగుమిదొర గా నిక్క
బలితంపు లగ్గదింపుల బెడంగు
మొనలు గామలచి తీర్చిననీలిశానపు
గురిజాతి దంచిన గుళ్లసొబగు
నూనె కాకలఁ దేఱి జానైన చిగురుటం
బలిఁ గాచు పెనములపదనుతీరు
యీగకాలంతైన నెత్తిపాఱని గుఱి
నలవోని గుండు కోపుల యొయార
తే. మారసాతలకలితగభీరనీర
పరిలుఠన్నక్రకమఠాహిభయదపరిఘ
యగు బొబ్బిలికోటమాహాత్మ్య మరయ
నబ్బురము నింపదే యెరికైన నహహా. 28

ఉ. బెబ్బులిమీనమైన మెలిపెట్టి తెమల్పఁగవచ్చుగాని హా
నిబ్బరగండఁడైన ధరణీపతి రావుకులీనుఁ డేలు నా

బొబ్బిలికోటపై నడచి పోరఁగ రాదు కిరీటికైన మా
యబ్బపదంబు లాన నిజ మాడెద హైదరుజంగుసాహెబా
మ. మదదంతావళగండశైలమరిభీమస్యందనత్సావహాం
బుదితక్షిప్రహయావళీహరిణముద్యోతత్ప్రితాపాతపా
స్పదపాదాతమృగేంద్రమవ్వొలమరాజకూరిమంథాద్రివై
ర్యదర్థి ప్రచ్చుట వింతయే ముసలిమానుర్వీపతిగ్రామణీ.
ఉ. నాలుగువేలకాల్బల మనారతముం దనుఁ గొల్వ నాపయిం
జాలిన మేటిమానసులు సాహసధుర్యులు పద్మనాయకుల్
కాలుసఁగాలు మెచ్చికొనగాఁ దగియుండు సహస్రమమ్మహీ
పాలునియొద్ద నాఘనుఁ డపారపరాక్రముఁ డెన్నిభంగులన్.
ఉ. కావున బద్మనాయకశిఖామణి యైన మహానుభావుఁ డా
రావుకులాగ్రగణ్యుఁడు దురాగ్రహబాహుబలప్రభూతగ
ర్వావిలమానసుం డయి దివాణమువారలఁ జీరికిం గొనం
డావిభుఁడెట్టిధన్యుఁడొ భయంపడఁడెంతటిఖాన్నిఘాలకున్.
తే. సీమలోపల పితరులు చేసికొనుచు
సిస్తు వడనీఁడు పైకంబు దస్తుగాఁగ
నివ్వఁ డవ్వల నిఁక నేమి అవ్వబలుక
వారు తమజేరు దస్తులో రారు నిజము. 33
మ. అని రాజన్యునితెప్పు దాట్లు కుటిలవ్యాపారసంభాషణల్
వినుచో హైదరుజంగుసాహెబు కడు న్విస్మేరచేతస్కుఁడై
నిను మున్విందు మామందశౌర్యకలనానిస్తంద్రసైన్యావళీ
ఘనసంరంభి వటంచు నవ్వొలమ నీకన్నన్ బలాఢ్యుండొకో.
మ. అన నారాజవతంసుఁ డిట్టులను నాహాతాంధ్రపాపయ్యనాఁ
జనువాఁ డొక్కఁడె చాలు మామకభుజాశౌర్యంబుఁ గో

ల్పుచ్చు తెం, పున కామన్నె కుమారుపౌరుషరసంబు ల్వల్క
గా నేల న, ర్జునగంగాసుతకుంభసంభవులనేర్పు ల్గావె తద్ద
ర్పముల్. 35

తే. అనుచు నారాజుపలికిన యాగడంపు
ముచ్చటల కబ్బురం బంది మొఱకుతురక
కఱఁకుఁదన మూఁది కొనవ్రేలిఁ గఱచికొనుచు
నాగ్రహమ్మున నతనితో ననియె నిట్లు. 36

శా. ఏలా జేరకురాఁ డతండు పయికం బేలా దివాణాన కీఁ
జాలం డస్మదపార ఘోరనిబిడజ్వాలాకరాళాయితా
భీలక్రూరశతఘ్ని కానికరగంభీరారవప్రౌఢిమం
బేలా గుర్తెఱుఁగండు చూతమిఁకఁ దద్భీమప్రతాపోద్ధతుల్.

శా. కీలాభీలము లిప్పరానులఫిరంగీ లగ్నిమూర్తు ల్మహా
కాలుండైనను గాలుఁడైన నెదురంగా నోప రిచ్చోట మ
న్నీలంచుం బలుకంగ నేటికి పఠాణీల న్విరాణీతురా
ణీల న్గోటను జిమ్మలేదె మును బిన్నీ బారులం బోరులన్. 38

సీ. తలఁపు తాళ్శిళ్లలో మెలఁగఁ జేసితిఁగదా
కళసింధుఘూర్జరాశ్మంతపతులఁ
జేరుద స్మునకుఁ దెచ్చినవాఁడ నేకదా
మరహాట కరహాట మత్స్యపతుల
ధర బందిగీలఁగాఁ దార్చి తెచ్చితిఁగదా
మాళవ చోళ నేపాళనృపుల
తఱపిజులో మొల్ల రుజువు జేసితిగఁ
నానావర్గై రాల నాఁడునాఁట

తే. ఫాదుషావారి మీరు బరీదు సైదు
ఢక్కను మొగల్గరీబువశాణు లాది
ఫౌజులఁ బలాయన క్షమునర్చ్చపటిమ గల్గు
తురకదొరలము మాకు హిందువులు భరమె. 39

తే. సిఫహసరదారుగారితోఁ జెడ్డగొన్న
కవ్వడికి నైనఁ గాందిశీకతగడంగు
మన్నవా రనఁగా నెంత మాఫిరంగి
మండలంబుల ఘుటికా ప్రచండగతికి. 40

చ. అతనిగడీపటుత్వమును నాతనివిక్రమశక్తి తన్మహో
ద్భుతు లగు పద్మనాయకుల దోర్బలవైఖరి యెన్న నేలమ
ద్వితతశతఘ్నికానికరవేగము మమ్మఁల మాఫరాసునం
తతులపరాక్రమక్రమముఁ దల్పఁగ లేవయి తే నృపోత్తమా.

చ. అలఁతుల కోపనేర్తురె దురాగ్రహచిత్తులు నిప్పరాసులు
జ్జ్వలతరధాంధమీనినదసత్వరభూరిభయానకార్భటీ
కలితశతఘ్నికాతతినగాదులు దెల్పుచుఁ గొండలైన బ
ద్దలు వడి వ్రాలఁ జేయఁ గల తద్గతి కిట్టిగడీలు లక్ష్యమే.

ఉ. అంగభవారిభూరినిటలాంబకవహ్నికణంబులట్టు లు
ప్పొంగుచు గుండు వ్రాలునెడ భూగగనస్ఫుటనాకఠోరతా
భంగురకాలమేఘరవభైరవరావము లుగ్గడింప కా
రంగులు మాఫరంగుల ఫిరంగుల రంగులు మీఱెఱుంగరే.

శా. లాడూఖానుకుమందమొక్కరుఁడె కిల్లాలెల్ల లగ్గల్గొనెఁ
గ్రీడాకేళి ఫరాసుతేని కెదురేరీ యున్న లోకత్రయిం
జూడ స్థాయిశిఫాయి గుంపులభుజాస్ఫూర్జత్ప్రతాపంబు లే
జేఁతం గన్న విమానకలత్యమ్ములుగా హిందూలదోర్గర్వముల్.

శా. కాని స్వాంతప్రయోజనం బనుచు న్యట్కారంబుగాఁ బల్కు
నా,ఖానోత్తంసముఁ జూచి రాజు మదిలోఁ గౌతూహలం
బంది యెం,తైన న్సామము దాన భేదములుగా వప్పట్టునం
జూడ నా,భూనాథాగ్రణి దండసాధ్యుఁ డని నీబుద్ధి న్విత
ర్కింపుమా. 45

మ. అని యాఖానుని మానసం బెఱియఁ గ్రూరాలాపముల్గొ
న్ని ప,న్ని నిజాంతఃకరణంబున న్వెలఁగు దుర్నీతిప్రసంగం
బునే,ర్పున విజ్ఞప్తి యొనర్పు వేళ గలిగెం బోనేఁడుగా మాక
టం,చునుదీర్ణప్రతిభావిభాసితముఖాబ్జుండౌచు రాజంతటన్.

మ. బలవద్విక్రమశాలినాన్నృపుని మీఁబల్మి న్నివారించి బొ
బ్బిలిలో మమ్మభిషిక్తుఁ జేసి పిదపం బెంపేది తద్రాజ్య మె
ల్ల లసత్ప్రీతిని మా కొసంగినను లీల న్మీకుఁ బన్రెండుల
క్షులరూపాయలు పాయనంబులుగ రొక్కం బిత్తు నిక్కం
బుగన్. 47

శా. ఆమాట ల్విని ఖానుఁ డర్థకృతమా నత్యాశ దీపింపఁగా
నామీఁదం బ్రభవించుహానికిని బాపాయత్తదుర్వృత్తికిన్
మోమాట ల్గనలేక మంచి దని సమ్మోదంబునం బొందెఁ జా
లా ముఖ్యంబుగ నర్థకాంక్షకుల కేలా యూర్జితాలోచనల్.

మ. అలఘుప్రాభవరాజవర్య భవదీయాశాస్య మెట్లట్ల బొ
బ్బిలిఖిల్లా కధికార మిచ్చి నిను నొప్పింతుం దదావాసులన్
మలలం జొన్పుదు సాహుకారుతసిలీ మ్మాకిచ్చి కట్టంబులోఁ
గలకార్యంబిదిరూఢిసేయుమన నాతండాగ్రగణ్యుం డొగిన్.

తే. పారసీకాగ్రగణ్య నీపరమమైన
చారుకారుణ్యరస మిట్లు సంభవించె

దాన విశ్వాస ముదయింపఁ దగినకొలఁది
నమ్మికలు సేయు టిది మాకు సమ్మతంబు. 50

క. పరిధాన మిచ్చుపలుకులు
కొఱఁ గాదన మిపుడు మీరు కోరినవారికిఁ
నెఱతనపుసాహుకారులఁ
గర మరుదుగఁ గూర్చి పూఁటకాఁపులఁ జేతున్. 51

క. విశ్వాసపుట్టునట్లుగ
శశ్వద్గతి మాకు నమ్మఁజాలినరీతిఁ
విశ్వస్తుతగుణయవనా
ధీశ్వర ప్రామాణ్య మొసఁగు మిత్తఱి ననుడున్. 52

శా. తేజం బంది తురుష్కనేతతనయుత్కీర్తిస్ఫూర్తి దీపింప రా
జాజీ సీమదిలోన నింతవసవాసాసర్వదిఙ్మండలీ
భ్రాజత్సత్యపరాక్రమప్రకటితప్రాంచద్యశశ్శాలికిఁ
నైజం బొక్కటికాక మీరు గలదే నావాక్యము ల్పొల్లులే.

క. హల్లాసేయుదు బొబ్బిలి
కిల్లాతజ్జయము నీకుఁ గీల్కొల్పుదునే
కల్లాడఁ జుమ్మి యిది నా
యల్లాచరణంబు లాన యధిపవతంసా. 54

మ. అని రాజన్యుని పాణిపల్లవము స్వీయంబైన కెంగేల గై
కొని ర మ్మంచును దోడుకొంచుఁ జనుచుం గోదావరీతీర
కా, నన దేశంబున నొంటిపాటున శమీ నాలోనఁ గూర్చుం
డి యా,జననాథాగ్రణి యాంతి, మెచ్చఁగ నభీష్టాలాపము

తే. కపట మొక్కింతలేక నిక్కమ్ముగాఁగ
ఖానుఁ డర్థంబుపై దృష్టిఁ గట్టిపఱచి
నృపమణికి నిచ్చె నమ్మిక ల్కృప,దలిర్ప
ఘోరతరమైన యొకతరవారు ముట్టి. 56

శా. కత్తిం గొట్టి ప్రమాణపూర్వకముగా ఖానుండు నమ్మించి
నం,జిత్తస్వాస్థ్యము నొంది క్షత్రియకులశ్రేష్ఠుండు తౌరు
ష్క రా,ట్చిత్తగ్రామణిమానసం బలర సాహాకారుటీపి
చ్చి సో,ద్వృత్తి న్వాని యనుజ్ఞఁ గైకొనుచుఁ జేరెఁ వేల
మాత్రీయమున్. 57

వ. ఇవ్విధంబున విజయరామరాజధరారమణావతంసంబు సంస
త్ప్రికారంబునఁ దనమనోరథంబునకు ననురూపాటోపంబు
లాచరింప నిరపాయం బగు సహాయంబున ననుకూలించు
కతనం జతనం బగు మనంబున జనించు నప్రతిమప్రమోదం
బప్రమాదంబునం బరఁగ నారేయి నిలచి చలిచీమకాటు
గా దనయొనర్చు కుయుక్తిచేష్టావష్టంభంబు లోకులకు నిం
చుకించుక సూచించుచు మఱునాఁటియుదయకాలంబున.

శా. రాచక్రంబున మేలుబంతి యనఁగా రాజిల్లు నారాజకూ
చీఁ జేయించి సమంచితాత్మబలవత్సేనాసమేతంబుగా
భూచక్రం బదుర్వంగ బూరటిలు విస్ఫూర్జత్సమిద్భేరిస
ధ్రీచీనంబుగ మున్నుగాఁ గదలి యర్థిం జేరెఁ బెద్దాపురిన్

తే. ఖానుఁ డంతట నతులితోత్కర్షఁ బెఱయ
నుద్ధతులముల్కుగారితో నొయ్యనొయ్య
రాజుఁ దానును వలుపు వార్తారహస్య
మంతయును దెల్పె నతనికి హర్షఁ మొదవ. 60

క. మూనాబూనీవారిదు
బానీలక్ష్మణసమాఖ్యఁ బరఁగు నతం డు
ద్భాసితమనస్కుఁడై శ్రీ
నాసాహెబుపన్నుగడకు ననుకూలించెన్. 61

శా. ఆరాజన్యుఁ డొనర్చు దుర్నయవిచారాలాపచేష్టావిధుల్
మేర ల్మీఱుచు నంతకంతప్రచురోన్మేషక్రియావైఖరీ
రారాజద్గతి నెల్లవారలకుఁ గర్ణాసహ్యతం బర్వె రం
గారాయప్రభుమాళియున్విని మోఁదతౌఁకుటిల్యవార్తాస్థితుల్.

సీ. ఈరాచబిడ్డని క్రూరకర్మవిచార
మిదియ నూర్జిత మని యెన్నువారు
పౌరుషశాలిరంగారాయనృపమౌళి
వెనుకఁ ద్రొక్కఁ డని యనెడువారు
ఘనులు వీరుం డొరు లెక్కలహింపఁ దద్ధరా
జనులకుఁ ద్రొక్కటం బనెడువారు
జయపరాజయములచందము తెలుపదై
వాధీన మిది యని యాడువారు

తే. నిర్నిమిత్తవిచార మీదుర్నయంపుఁ
బనులు బలనాశకర మని పల్కువారు
నెవ్వ రె ట్లయ్యెదరొ వీర లిట్టికలత
ననుచుఁ జింతానిమగ్నులై రఖలజనులు. 63

తే. అత్తెఱంగునఁ దమలోన నఖలజనము
లిలఁ గలుగువారు పలువురుఁ బలుదెఱఁగుల
పలుకులవిచారములఁ గుంది కలఁతనొంది
డెందములయందు ఖిన్నతఁ జెంది రంత. 64

శా. రంగారాయనిగారు గారుడశిలారంగద్వితర్దిజ్జ్వల
చ్ఛృంగారాయతనంబునందుఁ జెలుచం జెంగల్వ రాచె
ల్వారా, సింగంపుం దనునైన గద్దియపయిం జెల్వొప్పఁ గూ
ర్చుండి సప్తాంగప్రాంచదమేయరాజ్యభరణప్రజ్ఞామహోద
గ్రుఁడై. 65

మ. హితులు న్మంత్రులు గాయకుల్కవులు సాహిత్యప్రధాను
ల్పురో,హితులు న్నాయకులు న్సఖు ల్సహజులు న్హేలా
గతిం గొల్వ న,ప్రతిమోల్లాసవికాసలాలసమనఃపంకేరు
హుండై నిజా,స్థతతిం జూచి రసోచితంబుగ వినం బల్కె
న్మృదూక్త్యర్భటిన్. 66

సీ. సరకారుభారంబు వరియించి హైల్లుగా
వడి ఫరాసెకిమీఁదు వచ్చుటయును
విజయరామక్షమావిభుఁ డాదిగా జమీ
దారులెల్లను వానిఁ జేరుటయును
దత్ప్రధానత్వంబు దాల్చి హైదరుజంగు
రాచయేలికపక్షమై చనుటయు
మనమీఁదివైరంబు పెనఁగువతో రాజుఁ
జొప్పించి కొండెము ల్సెప్పుటయును

తే. లక్షలకొలంది పైకంబు లంచ మిచ్చి||
రాజు మనపైకి జాతివారలఁ గురించి
వచ్చి కలహించి యీరాజ్యవైభవంబు
తా ననుభవింపఁ దలఁచుట దా నెఱింగి. 67

క. అనిమిత్తవైర మీచో
ప్పునఁ దలపెట్టినవిరోధి భూపతి యాఖా

నుని వెనుకొని రాతద్ద
ర్శన మొనరింపంగ మనకుఁ జన నొప్పగునే. 68

ఆ. తగు వకీలుఁ బనిచి తన్మనోగతములఁ
దెలిసికాని పోవ వలనుగాదు
ఖానుఁ డర్థకాంక్షి నానరాధీశ్వరు
పిశునకృత్యమునకు వశగుఁ డగుట. 69

క. తనధనబలసంపన్నత
కెన యగువా రెవ్వరనుచు నెంతయు గర్వం
బునఁ బెనఁగొని యుండుట యా
యన మనపౌరుషముతీరు లరయమిఁ గాదే. 70

తే. తగవు ధర్మంబు విహితంబుఁ దప్పనీని
నయవిచారమ్ముచే దివాణమ్మువారు
మనల వారల సమదృష్టి నెనయునట్లు
చూచిరా లెస్స కాదేని సూటిపడదు. 71

ఉ. చూతము మీఁదిదైవగతిచొప్పునఁ గాఁగలయర్థ మెట్లొ? త
ద్రీతిని నానృపాలకులదీపకుఁ డాతఁ డొనర్చు దుష్టక
ష్టాతతతంత్రయుక్తుల కోడంబడి ఖానుఁడు నిర్నిమిత్త మే
లా తగ వాలకింపక చలమ్మున నాలుపదొమ్మి కొప్పెడున్.

ఉ. ఖానునిచేత నమ్మికలు గైకొని లంచము లియ్యకొల్పి కా
ర్యానకు వచ్చువాఁడయి ఫరాసులతోఁ జను రామరాజభూ
జాని ప్రయత్నమెల్లఁ గొనసాఁగఁగ నీని యుపాయ మెన్ని దూ
రానకె తప్పఁ ద్రోచుటయె రాజతనం బని తోఁచు నామదిన్.

చ. ఒరులధనంబుఁ గోరు రిపుయోజనదువ్వలఁ దూలపుచ్చు ని
ర్భరతరమంత్రశక్తికి సహాయము లేనియుపాయ మిష్టు బం

దరుపురి కొక్కనిం బనిచి ధార్మికలోకవతంసమా కుమం
దరుఁ బోడఁగాంచి శాత్రవవిధంబులఁ దెల్సి మరల్చు
టొప్పదే. 74

మ. మనల న్భూరికృపానురాగములచే మన్నింతురా రెడ్డినా
యనిగారుం గపితాఖ్యుమందరును నెయ్యం బొప్పఁగా వారిఁ
గ,న్గొని తన్మూలముగా విరోధిజనులం గుంఠీభవత్కీర్త్యవ
ర్తనులం జేసి తొలంగఁ ద్రోచుటయె యుక్తం బెన్నిచందం
బులన్. 75

మ. మనతోఁగూడినకార్యమెల్ల తమజిహ్మాయున్న దారావువం
శనిధానం బగురంగరాయమహీభృచ్చంద్రుండు మాకిష్టుఁ
డా,యన మేలొప్పనిరాజుమాట లవి మీరాలింపరా దంచు
ఖా,నునకు న్బాసికిఁ దగ్గ యుత్తరము లెన్నో యన్నియుం
దేఁ దగున్. 76

శా. గోరుం దోరుహితోపదేశమునకుం గొండొక్కటా డంబుదు
శ్చారిత్రుండు మియానుయావిలుఁడు మూసాబూసి హర్షాద
యో,దారాత్ముం డగు రాజుఁ దల్చు కుటిలౌద్ధత్యంబ సత్యం
బునం,జేరు న్సార్వ్యకర ప్రసారణమునఁ శేషించు మంచో
యనన్. 77

ఉ. హైదరుజంగుతోఁ బలుక నక్కఱ యించుక లేకయుండ
నౌఁ,గా దని సీమతోఁ గల నిఘావరకారుక్రమంబునం బరి
చ్ఛేద మొనర్చి యందె యరసేయక పూట యొసంగి తగ్గ
తా,ఖదులు వీరిపేర్కట లిఖింపఁగఁ జేయుట మంచిదే కదా.

మ. అని మంత్రాంగనిరూఢి యొప్పఱచి ధైర్యస్థైర్యవాక్చాతురీ

ఘనునిం బంతెనవంశ్యు బుచ్చన యనంగాఁ బేర్చువాని
స్వకీలునిజాప్తుం బనిచెం గుమందరుని నాలోకించి కార్యం
బు సం,తసగూడం దగురీతిగాఁ బలికి ఫోక్లా సేయు మం
చు న్వడిన్. 79

శా. చాతుర్యోక్తులఁ బంతెనాన్వయమునన్ సర్వంకషప్రౌఢిప్ర
ఖ్యాతిం గాంచిన కొండమంత్రిమణికిన్ గారాలపుంబట్టివై
సీతారామన వెంకనాహ్వయులకుం జెల్వంపుసైదోడువా
నీతో నీ డెవరంచుఁ బుచ్చె నను మున్నే యన్ని మన్నిం
చుచున్. 80

తే. అనుపమానప్రభావుఁ డజ్జనవరేణ్యుఁ
డనుప మసలక యతనిచ్చే నాజ్ఞ వడసి
అతులితస్వర్ణపల్లకీకాధిరూఢ
గాఢసామ్రాజ్యరమనేలి కదలివచ్చి. 81

ఉ. ఆపరమప్రగల్భవచనామరదేశికుఁ డావకీలు పె
ద్దాపురిమీఁదుగా నరిగి తత్పురసంస్థితురాజుఁ గాంచి స
ల్లాపము లొక్కకొందడువు లాననిచేఁ బచరించి యందుఁ
జూ,పోపమి యాత్మలో నెఱిఁగి యూర్పు నిగుడ్చుచు లేచి
దిగ్గనన్. 82

చ. ఇతనిమనంబు క్రూరతవహించినచొప్పెఱిఁగించుచున్న ది
ష్మతమిటువంటి దష్మసలిమాన్ద్రర మానసవృత్తి యట్టిదో
కతిపయవాక్ప్రసంగములఁ గానఁగ నయ్యెడు నంచు నత్వ
రా,యతగతి నప్పుడే కదలి యాయన లష్కరుచేర నేగు
చున్. 83

చ. కడువడి పిన్నపెద్ద లగుఖానులకు న్నజరుల్నయించుచుం

బొడగనియెం దురుష్కజనపుంఖితపుష్టసభాంతరంగునిన్
గుడపరిమిశ్రధూమచయగుంభితభూత్కరణానుషంగునిన్
జడరసమద్యపానమదసంగుని హైదరుజంగు నొయ్యనన్
తే. గుడిగుడీధూమపానవిఘూర్ణమాన
చకితదృగపాంగు హైదరుజంగుఁ గాంచి
నజరుగుజరానుపఱచె సొన్నాకడాని
జాలె మాతఁడు కూర్నిసాతుచేసి. 85

శా. ప్రాంచద్విక్రమశక్రసూతి యగు నా రంగావనీభర్త దాఁ
బంచె న్వీఁడె వకీలు హాజరుగ రీ ప్వర్వర్మెహార్బాన్ సలా
మంచుం గొంచక చోపుదారు లెదుటన్ హర్షంబునం దె
ల్పఁగాఁ, గాంచెన్ హైదరుజంగు క్రోధరసయుక్తామ్రా
క్షుఁడై యాతనిన్. 86

శా. ఖానుం డట్లతనిం గనుంగొనుచు రంగారావ్ జమీాదారు
కే, జానీహేతుమిదల్కమాయ యని యస్తవ్యస్తపున్నై ల
జభా, షాన్నైపుణ్యముఁ జూపుచుం బలుక హోసాహేబు
మాటాడకన్, జానేవాస్తెహమా యటంచు నతఁడున్
స్వా లిచ్చెఁ బ్రత్యుద్గతిన్. 87

తే. ఈవకాలతుఁపనవారశీా వహించు
బహుతుగుండాతరాజితుబమ్మ ననుచు
కోపవల్లులు చివురింప గూఢపఱచి,
మెల్లమెల్లన నతనితో మ్లేచ్ఛుఁడనియె. 88

శా. రంగారాయఁడు మామొలాజుమతుకై రాకేటికిం జిక్క
నా, బంగాళాపురగౌతమీతటనటద్బహ్వాష్ఠధాత్రీశు లె
ల్లం గూర్మిన్ మదనుజ్ఞఁ జెంది హితలీల న్వచ్చు నిష్టాప్తిఁ

జో, కృంం గానం డోకో వెల్మబిడ్డ మములం ఖాతీరుకుం
దేఁడోకో. 89

మ. ధరణీమండలి నుండు నెల్లరు జమీందారు ల్భయం బంది
మా, ఫరమానా శిరసావహించుకొనిరా పాటింప కారా
యఁ డీ, సరణీ రామికి నేమి చెప్పదన కేల్ శెంషేరుతా
రీఫుచే, సరు దేర న్మదిఁ దల్పఁడేమొ యతఁ డాహా మేల్మి
షాయీగదా. 90

చ. తురకలరాజ్య మాట మదిఁ దోచక యున్నదొ సాధ్వసా
వహా, ధ్దురరణరంగవిక్రమము దోగెడువారు ఫరాసు
లన్న పే, రెఱుఁగఁడొ రావు గాకునికి హేతువు గానని
మాకుఁ దోఁచె ని, పృఛ్ఛుసుదనాస మ మ్మతఁడు భావము
నందు ఘనందు సేయఁడో. 91

చ. విపులపరాక్రమాతిశయవిశ్రుతమూర్తి నటంచుఁ దోడిధా
త్రిపులు దొఱంగి పాఱ బెదరించెడిచాఁప్పన నిప్పరాసులం
గపటమనస్కతం జులక గాఁ దలపోయుట లెల్లి వేఁడి గా
లపుసిడిగానిగంపసిడిలాగున నుండీదు మన్నె తేనికిన్. 92

శా. ఫల్లామరిచిది రావుగారు తనదోఃపాండిత్యసంపద్బలా
దుల్లాసంబున గర్వితుం డగుచు రా కున్నాఁడు గాఁబోలు
మే, మెల్ల న్నీదొరిదర్శనంబునకుఁ గా నేతెంతు మంచు న్స
నా, గ్భల్లుండై ఖతడాజవాబు నడపెఁ ఖానుండు తద్దూత
తోన్. 93

ఉ. అంతట నవ్వకీలు వినయమ్మున లేచి సలాము చేసి మీ
యంతటిఖానుసాహెబుల నాదరణోక్తులఁ బల్కఁ బాడియే
సంతతధర్మశాలి విలసన్నయశీలి మదీశ్వరుండు గో, రంత

యు వింత నేరనిమహాత్ముఁడు మీకు విధేయుఁ డెన్నిటన్.
చ. కర మరుదైనపేర్మిని శ్రీకాకుళపు న్సరకారుభార మీ
సరణి వహించి యోర్పున ప్రజాహిత మొప్పఁగ ఫౌజుదారి
కీ౯, నెరపెడివాఁడ వెల్ల ధరణీధవచంద్రులఁ గూడ కట్టు నే
ర్పరయక యిట్టులాడఁ దగవా నృగవా పగవానికై వడిన్
మ. తలితండ్రాదులవంటివారలుగదా తల్పం దివాణంపువా
రలు చూడ న్ధరణీజనమ్ములు కుమారప్రాయు లట్లాటఁ గే
వలరాద్రోక్తులఁ బల్కఁ జన్నె పితరు ల్వంచింతురే మీరు బి
డ్డలమీఁదం గృపనివ్వటిల్లు కడకంటం జూడ్కి సారింపఁగన్.
శా. మీచిత్తంబున కిట్లసూయ పొడమ౯ మ్లేచ్ఛాగ్రణీ యింత
దు, ర్వ్యాచాతంత్రము లెవ్వరెవ్వరలు మద్వైరు ల్ని వేదించి
రో, యీచాటూక్తి కుయుక్తి కల్పనలచే నీబుద్ధి నీకుండెనా
మాచేఁదీఱదు తగ్గవారు దెలుప౯ మానేర్పునీ ధూర్త్యముల్.
చ. అని తెగనాడి యాయవనుఁ డర్ధకృతాశలరాచవారికో, పు
నఁ బడి దుర్ణయంపుఁబని బూనినవాఁ డని యాత్మ నెంచి యి
క్కనుక యణంపఁగాఁ దగినకీర్తి ధురంధరుఁ డగ్గముందరుం
డని కృతనిశ్చయుండగుచు నాయన బందరుమార్గగామియై.
తే. అచట నడచినవృత్తాంత మాత్మనృపతి
కంతయు నెఱుఁగఁ బనిచి యనంతరమున
ఘోరకాంతారగిరిగుహాకుంజపుంజ
నదనదీదుర్గముల దాఁటినాఁడు నాఁట. 99
చ. చని చని కాంచెఁ గాంచననిశాతశిరఃపరిచుంబితాంబర
మ్మునులవణాంబురాశిజలపూరనిరంతరదూర్మిమాలికా
నినదసమగ్రజాగ్రదవనీజనబంధురము౯ ఫరాసువా

రినిభరియించుబందరుపురీవరముం గరమొప్ప డాయుచున్.

సీ. అభ్రంలిహోదభ్రహరిహయాయుధశిలా
కలితసౌధావళు ల్గాంచి కాంచి
మందురామందిరనందీప్తజవనాశ్వ
సుందరాకృతిగతు ల్బూని చూచి
వివృతాస్యగహ్వరవిస్తారితాయోమ
యాగ్నేయయంత్రంబు లరసి యరసి
సమదసామజఘటాచటులగమాగమా
తిప్రసంగములను దెలిసి తెలిసి

తే. రక్తరాంకవకంచుకయుక్తదృప్త
పాణితలచాలితకృపాణపటలజటిల
భీకరకరాళవదను లై పేర్చువారిఁ
గ్రూరులఁ బరానుజనులఁ గన్గొనుచు నరిగి. 101

ఉ. రాయవకీలుకట్టెదుట రాజిలు నొక్కచిరత్నరత్ననూ
త్నాయతనంబునందు గొలువై చెలువైనయొయార మింత
యా, రాయనఁ గానుపించి రుచిరాయనకీర్తిధురంధరుండు
నా, రాయణుఁడో యనం జెలఁగు రాయని గాంచెను రెడ్డి
నాయునిన్. 102

తే. కాంచి యాభాగ్యసంపత్తి కౌరవేంద్రు
సాంద్రకరుణాతరంగముల్ సంగ్రహించి
సరస గూర్చుండి తనకార్యసరణి యప్పు
డతని కంతయుఁ దెల్పెఁ బండితవరుండు. 103

చ. అతఁడును నట్టికృత్యమున కద్భుత మంది యనింద్యకీర్తిరా
జతనికి నేమిటం గొఱత యన్యులసొమ్ముల కాన గోరి దు

ర్మతి మనువాని కమ్ముసలిమానున కెవ్విధి కోపముట్టఁగా
నతికెనొ యెట్టిమానవుఁడొ యంచు నహో యని వెచ్చ
నూర్చుచున్. 104

ఉ. రాజున కెంతవెట్టి యపరాజితమూర్తులు వెల్మవార లా
పై జగతిం బ్రసిద్ధు లురుభండనభూములరావు వారల
వ్యాజముగాఁగఁ బ్రోల్దుడిపి రన్నయశం బటు కావునం దదు
ద్వేజకచేష్టలెల్లఁ గొఱవిం దల గోకికొనం దలంచుటల్.

మ. ప్రకటీభూతబలావలేపకలితప్రజ్ఞావిశేషాప్తిఁ గొం
కక నిష్కారణ మిట్టిదుర్ణయపుమార్గం బంట వర్తించు క్ష
త్త్రకులగ్రామణికిం తెకా దొగి నధర్మం బన్నచో సప్పురా
రికి నైన న్వెనుకంజ వైవరుగదా రేచెర్లగోత్రోద్భవుల్. 106

తే. గర్వితారాతిరాజన్యకాండకఠిన
కంఠలుంఠనజాతరక్తాంబుపూర
మజ్జనవ్రతదీక్షాభిమానఘనులు
రావువారలు వట్టివారా తలంప. 107.

మ. తమపైఁ గీడొనరించువారలపయి న్దర్పించుట లా[illegible]జన
త్తము లౌ వారికి ప్రీతిలోకులవిషద్వైషమ్యసంప్రాప్తిగా
ర్యములో నడ్డము వచ్చి కాచుటలు క్షత్త్రాచారము ల్గాన ధ
ర్మమెయీరాజకుమారమన్మథున కారావాతనింజోరుటల్.

చ. తురకలునుం బరాసు లతిదుర్మదు లర్థముమీఁది తృష్ణ నె
వ్వరియెడ నేని తెంపు తెగువల్గొనఁ జూతు రిఁకెందు వచ్చి
రెం, దరుగునో యట్టిదుర్ణయపుటారడి కెంతయు నియ్య
కొల్పుటల్, నెరవరిగాడు రాజనుచు నిష్ఠురవాక్యము లుగ్గ
డించుచున్. 109

క. ఆరెడ్డినాయకుఁడు రం
గారాయవకీలు నతికృపావనలోలుఁ
గారా మెప్పుఁగ రమ్మని
గోరుం దొరదర్శనమునకుం గొనిపోవన్. 110

చ. ముదితమనస్కుఁడై యతఁడమూల్యమణీఖచితంబులైన రా
ట్సదనము లాపణంబులు విశాలశిలామయవేదు లద్భుతా
స్పదవిజయధ్వజావళులు పద్మసరఃప్రకరంబులుం జర [న్.
న్మదవదిభప్రకాండము లమందగతిం గనుఁగొంచు నేగుచు

శా. ఘోరాకారులు శోణితాననులు రక్షోవీరసంకాశులుఁ
ఘారా గ్రుమ్మరు ద్రిమ్మరీ లెదుర సంభావించుచు న్మంచిశృం
గారం బైనహజారముఁ విధుశిలాకక్ష్యాంతరంబు ల్దృష
ద్ద్వారద్వారకవాటము ల్గడచి సౌధం బెక్కి యాచెంగటన్.

సీ. రత్నపాంచాలికారాజత్కరాంభోజ
కీలితవాలప్రకీర్ణకంబు
మణిపంజరాంతరాసీనశౌకస్సంఘ
సంఘటితాలాపజనచయంబు
చంద్రోపలస్తంభచకచకద్యుతిమృషా
కౌముదీముదితవీక్షణచకోర
మభ్రంకషాభోగహర్మ్యగవాక్షాగ
తక్షప్రతానముక్తావితాన

తే. మగుచుఁ గనుపండువైన సౌధాగ్రభాగ
చంద్రశాలాంతరంబునఁ జందమామ
జాళికురిచీలమీఁది ఘరానుదారల
సొంపుదారలఁ గనుంగొని చోద్యమంది. 118

మ. కుతుకం బొప్పఁగఁ గాంచె నందుఁ గపితు న్గోరుం దొరం
బ్రస్ఫుర, ద్ధృతిసంరంభ నిరస్తమేరు హిమవద్వింధ్యాద్రిరా
ణ్మందరుఁ, శతకోటిప్రసవాత్ర్ర సుందరుఁ రసాచంద్రాననా
పాదప, ద్మతులాకోటిఝుళంఝుళా రవయుతో దంచన్మణీ
మందిరున్. 114

తే. ఇట్లు గనుఁగొన్న మన్నీని హేజుబారి
కప్పరాసులయొకిమీఁదు చెప్పరాని
మెప్పురాఁగప్పురపువీడ్య మప్పు డొసఁగి
కుశలసంప్రశ్న మొనరించి కుతుక మొదవ. 115

క. ఆరాయభారి వచ్చిన
దూరాగమనంబుఁ జూచి దోడ్తో నడిగెఁ
నీరాక కేమిగత మని
గోరుం దొరతనదుబాసికులమూలముగాన్. 116

క. మద్దాల రెడ్డినాయఁడు
తద్దయు నారాచవార్థిధౌర్త్యము సర్వం
బుద్దవిడిఁ దెలుపఁ దెలియుచు
నద్దిర యని మిక్కుటంపుటక్కజ మందెన్. 117

ఉ. బందరుపట్టణాధిపతి భాసురభోగపురందరుండు గో
రం దొరగారు విస్మయకరం బిటువంటిదు రాగతంబు రా
జుం దురకాతఁడుం దలఁచుచు న్వస రావుకులాగ్రగణ్యు పై
కిందిటమూఁదియేగగమకించుటచోద్యముగాదె యారయన్.

ఉ. మానితకీర్తిఁ గాంచు నభిమానధను ల్ధర రావువారు వ
న్నాన మొనర్ప నర్హు లనమానపరాక్రము లట్టివారిపైఁ
బూనిక చేసి కార్యగతి పొంకము సేయుట లెవ్వగాని దు

ర్మానితమూను నమ్మునలిమూనును రాజును బుద్ధిమంతులే.

మ. మును రాచాతఁడు వెల్మబిడ్డఁడును మమ్మం జూడఁగా వచ్చి వా,రును వార్పున్నివరిం చుచోఁ దగదు మీరు స్నీరు చూపో పకుం, డని వైరంబునఁ బోరు పెట్టు కొని యిట్లాడంగ రాదంచు నా, కినుక ల్మానిపిపుచ్చినారము మృదూక్తిన్వారి నత్యంతమున్. 120

మ. అభిమానంబె ధనంబుగాఁ గలుగువా రారావువారల్మహో విభవుం డీతఁడటంచు నోడరు రణావిర్భూతమై పేర్చు ప్రాణభయావేశము లేశమైనఁ గనుగాన న్రాక రేచర్లగో త్రభవుల్పావనుజంప రాజునకయుక్తంబిట్టిచో వైరముల్.

తే. రావువారిగడీమీఁద రాచవారి
పనుపునఁ బరాసువారు కోపంబు జేసి
నడచినారనుడుష్కీర్తి పొడమకున్న
మామకీనుల కిదియ ధర్మంపుఁ దెరవు. 122

తే. నేర మొదవినచో నెట్టి క్రూరమైన
కర్మమున కొప్పు టిది జగత్ఖ్యాతిగాని
నిరపరాధులపై నిట్టిపరుసఁదనపుఁ
బని యసంభావ్యమని దూలఁ బలికికొనుచు. 123

శా. భీమాటోపుని నాభిజాత్యపురుషుఁ భీమప్రతీకాశు మూ సామర్త్యేనునమాఖ్యునిం బనిచె లమ్మన్లోనికిం బోయి మ త్సామర్థ్యం బెఱిఁగించి ఖానునకు మూసాబూసికిం దెల్పి ర మ్మామూయామయుఁ డైన రాజపలుకు ల్మన్నింపరా దంచోగిన్. 124

తే. రాజుచితునోక్తి చెవి సోని రావువారి

తెరవు బోరాదు మనకుఁ ద ద్దేశరాజ
కార్య మెల్లను మేమె సౌకర్యపఱచి
యర్థ మొనఁగూర్తు మిది ముఖ్య మనుచుఁ బలికి. 125

మ. మన కత్యంతహితంబుఁగూర్చినజగన్మాన్యుల్సుమీ రావువా
గనియు న్వారు కుటుంబసంగతులరై యచ్చోఁ బ్రవర్తిల్లువా
రనియు న్వారికి రాచవారికినిఁ బ్రత్యాసక్తివైరంబు ము,న్న
నియుం దెల్పుఁడిచేసియీవిషమకార్యంబున్నివారింపుమీ.

చ. అని నియమించి రావుకుల జాగ్రణి పంచిన మంత్రి వెంట మ
ర్తెనుఁ డను జాతివాని నతితీవ్రముగాఁ దగు నుత్తరంబులె
ల్లను లిఖియించియిచ్చి కుశలంబుగఁ బొండనిపంప నంతవా
రును బయనంబు సాగి చని రుగ్రతరత్వరగాఁ జరించుచున్.

తే. ఇట్లు చనుచుండ రాజమహేంద్రపురముఁ
గదలి పెద్దాపురమున లస్కరు వసించె
వారు కలియకమున్నె దుర్వారఘోర
వితతచతురంగసైన్యసంగతముగాఁగ. 128

మ. అటఁ బెద్దాపురిపట్టణంబుననె మున్నావాసముం జేసి మీఁ
దటికృత్యంబు కృతప్రయత్నమయి చెంద జ్ఞాగ్రదాలోచన
స్ఫుటవైషమ్యమనోవికారుఁ డగుచుఁ జూపట్టుచున్ ఖా
నుఁడ, చ్చటికి న్వచ్చు టెఱింగి డెందమున హర్షం బందె రా
జెంతయున్. 129

తే. ఖానుఁ డచ్చట నిల్చి నిఖా రయొన ర్చి
పోలునాఁ డాది యగు సర్వభూమిపతుల
రాజ్యములు వారివారికిఁ బూజ్యఫణితిఁ
దేరుగడ జేసి యిచ్చుచు ధీరమతిని. 130

తే. అచట నొక రెండుదివసంబు లధివసించి
కదలి చేరెను లష్కరు కసిమికోట
యందు గలసిరి వచ్చి కుమందరనుపు
మర్తె నాహ్వాయుఁడును రాయమంత్రిమణియు. 131

ఉ. వచ్చినవానిఁ గాంచి చెలువంబున బూసియు నెమ్మనంబునన్
హెచ్చిన కౌతుకంబున నహీనయశుండగుమందరుండు పెం
పచ్చు పడంగఁ బంపిన మహామహుమర్తెను గారవించుచున్
ముచ్చట సల్పి యంతటఁ గుముందరుపల్కు హితోక్తి మె
చ్చుచున్. 132

ఉ. హైదరుజంగునిం బిలిచి యాయనకుం దెలియంగఁ జెప్పి య
త్యాదరణీయుఁ డైన సుగుణాఢ్యుఁడు మాకు గురూప మా
నుఁడున్, సోదరసన్నిభుం డతనిసూక్తులు లెస్స గ్రహించు
టుత్తమ, స్వాదుసుధారసైకపరిచర్యలు నుమ్మని సమ్మదంబు
నన్. 133

చ. అదియునుగాక రావుకులజాగ్రణితోడి నిఖానమస్తమున్
మదుపరినిష్ఠితం బతని మన్నన సేయుట మంచిమాటరా
జుదితవిరోధబద్ధుఁ డయి యౌర్వ్యక చేయు కుయుక్తి నీరబు
ద్బుద మని వ్రాసి పంపె నిది బుద్ధిపరం బని యెంచి చూ
డుమా. 134

తే. ఇంక మన మిట్టు బొబ్బిలి కేగుపనికిఁ
గారణం బేమిగనుక సికాకులంబు
మార్గమునఁ బోదమనుచు సమ్మతిగఁ బలికె
నొడఁబడియె ఖానుఁడును బూసియుక్తి కపుడు. 135

తే. అప్పటికి మంచి దని వళ్ళి యాత్రలోన

ఖానుఁ డూహించెఁ దమ్ములఁ గణుతిగొనక
బందరుకుఁ బంపి యచ్చోట బట్టుసేసి
యుత్తరము దెచ్చినా రన్నయుత్తలంపు. 136

తే. క్షత్రవర్యుండు హైదరుజంగుఁ గలిసి
చూచితిరె మి మ్మొకింతైన సూటిగొనక
రావుకులసంభవుం డైన రంగనృపతి
కార్య మితరప్రపంచంబుగా నొనర్చె. 137

మ. మును నే నెంతయు విన్నవించు పౌరపు న్ముచ్చట్లకు న్వాగుచే
సినతంత్రంబునకు న్సమాన మయి మీచిత్తానకుం దోఁచి
యుం, డెనొ లేదో తమచేరుదుస్తునకు రా డీరావువంశో
దయుం, డనుమాట ల్నిజమేకదా యనుచు రోషావేశ
మెక్కించుచున్. 138

క. ఎక్కడిబందరుపట్టణ
మెక్కడ్డిబొబ్బిలిగడీ మరెటగోరుందో
రిక్కార్యము వడి నించం
ద్రొక్కుటె మే లనుచు రాచదొర పల్కుటయుఁ 139

తే. ఖానుఁ డట మున్న జ్వలితకృశానులీల
నుండుటకు దోడు సీరాజునుడువు లంత
వన్నియ వహించె మిగులఁ బ్రవర్గ్యఁజల్లు
బాలచందంబుఁ దెలుపుచు భగ్గురనఁగ. 140

మ. కలితక్రోధరసాంతరంగుఁ డగుచుం ఖానుండు దర్పించి చా
రులఁబంచె న్సహాయగూఢపూర్వగతుల నూగ్రీధంబుగానేగిబొ
బ్బిలిఖిల్లానలుదిక్కు లారసి తదాభీలస్థితిస్ఫూర్తిజం, గలు
ఝాడీమయిధానులం దెలిసి రంగారాయనిం గాంచుచున్.

తే. ఖాన్సహే బిమ్ము రమ్మని కాఁగితంబు
వ్రాసినాఁ డని చూపి శీఘ్రంబుగాఁగ
వర్తమానంబుఁ దెమ్మన వారు నట్ల
నరిగి గిరికాననమ్ముల తెఱఁగు లరసి. 142

మ. హరకారా లిటువచ్చినారు భవదీయాలోకనేచ్ఛారతిం
దురకాతం డనిపించినాఁ డనిన సంతోషించి రంగక్షమా
వరచంద్రుండును గొల్వుకూటమునకు న్వారిం గడు న్వేగ రా
నరు నంపించిన వారు వచ్చిరి మహానందంబు సంధిల్లఁగన్.

క. హరకారా ల్గొనివచ్చిన
ఫరావానా చూచి హర్షపరవశుఁ డగుచున్
శిరసావహించికొనుచుం
దిరమగు బహుమానజలధిఁ దేల్చె న్వారిన్. 144

మ. తగుప్రత్యుత్తరము ల్మహావినయసంధాబంధురస్ఫూర్తిమై
నగధీరుం డగురంగరాయనృపుఁడు న్వ్రాయించి పంపించె
నిం,పుగ నావచ్చినవారిసంగతముగా భూరిప్రతాపైకర
మ్యగుణాలంకృతుఁడా మెరాన్వయునిదిమ్మన్నప్రభుగ్రామణిన్.

మ. అతఁడుం దగ్గబలంబుతో నరిగి ధూమ్రాక్షప్రతీకోద్ధతా
కృతియౌ హైదరుజంగు నుగ్రతమదృగ్జ్వాలద్రుహాపావకో
ద్ధతకీలాముఖవిస్ఫులింగుఁ గని యాత్మ న్నివ్వెఱం గందు
చున్, హితముం దెల్పుచు నర్జుదాస్తుగుజరాయించె న్న
మంచద్గతిన్. 146

తే. అట్టు లరుదెంచి పొడఁగనునంతలోన
నెరపరము కన్నడోయికి నెగరఁబాఱె
యెత్తిడా లూనవ ఖాన్సాహెబుగారు

అలిగి దామెరదమ్మన్నవలనుఁ జూచి. 147

శా. ఏలా రాఁడు భవత్ప్రభుం డిటకు రాఁడేనిఁ మఱిఁ మేల్గడీ
ఖాలీ చేసి యథేచ్ఛ నేగు మని మీఖావందుకుఁ వ్రాయు
మీ, వాలాయంబుగ నిప్పు డీవని జ్వలద్వైశ్వానరుండో
యనం,జాలాకోపముతోడనుండిపడి పాశ్చాత్యుండు పల్కెఁ
న్వడిన్. 148

తే. అట్టిపలు కాలకించి దమ్మన్న యనియె
కోట ఖాలీ యొనర్చుట కేటిసబబు
మావలన నేర మేమి మారావుగారు
తమ్ము దైవంబుమాఱుగాఁ దలఁచుచుండు. 149

ఉ. నేరము లేనివారి మము నిష్ఠురవాక్యము లాడ మీకుఁ జ
న్నే రుచిరాంతరంగుఁ డవనీధవచంద్రుఁడు రంగరాయనిం
గారు భవన్నిరీక్షణనికామమనఃప్రమదంబె కైకొనం
గోరినవాఁడతండు తమకుం గరుణింపఁగ నర్హుఁ డన్నిటన్.

ఉ. ఓపిక లేక యిట్లు దగు నోటు భయోక్తులు పల్కు మీరు
హా, కీములి కించు కేని పరికింపక యస్మదరాతిరాజులే, మేమి
వచించినారో యవనేశ్వర వారలు పల్కినట్లుగా, మీమన
సిట్టిదైనఁ దరమే యెదురాడఁగ మాకు మీయెడన్. 151

ఉ. రాయనిగారివద్ద నపరాధ మొకించుక యేని లేదు ము, న్నే
యిటు వచ్చి మిమ్ము రమణీయగతిఁ బొడఁగాంచు యుక్తి
కిఁ, మాయకుఁ డైన యస్మదగ్రిమానవనాయకుఁ డిందుఁ
గల్గుటఁ,రాయడి పుట్టునన్న విధురం బగు బుద్ధిని రామి
తక్కఁగన్. 152

తే. మాయెడల నిట్టితక్సీరు మాపుచేసి

కొలు దయచేసినను రావుగారి నిపుడు
తావకీనావలోకనోత్సవము నెఱపఁ
బిలువ నంపింతు నసవుడు నలుక వొడమి. 153

చ. తరమిడి చూచి దమ్మనృపుధర్మనయప్రకటప్రసంగముల్
కరమును గర్ణశల్యములు గాఁగఁ బొరింబొరి నాటిన న్మ
హోగ్రధురగతి ఖానుఁ డిట్టు లను దోర్బల సంపద విఱ్ఱవీఁగి
యు, ప్పురుషుఁడు మాకు మార్మనలిపోరఁ దలంచినచూ
డ్కిఁ దెల్పెడిన్. 154

శా. కాలుక్ వ్రాయము తాను రా వలవ దింకం గోటబై
ల్వెల్లి జా,గాలో నుండక లేచి పొమ్మనుచు లేఖ ల్వ్రాసి
పుత్తెంచు మీ,వేళం గూడక యుండెనేని నిఁక నీవే పో
యి వేగంబ ఖి,ల్లాలో నుంచి వెడల్పు మంచు నతఁ
డల్కం బల్క సెల్వొందుచున్. 155

ఉ. బొబ్బిలివచ్చి దమ్మనప్రభుప్రవరుం గని ఖానునొద్ద నా,గు
బ్బుకొనం జనించు పలుకు ల్నెవి నించిన ధైర్య మూఁది
లో,నుబ్బెడు నర్థమోహమున నుక్కుమెయి న్బెదరించు
నేరుపుల్,దబ్బర సుద్దులాడుటలు తల్పి దివాణపువారినై జ
ముల్. 156

మ. గరిమ్ జూపి దివాణ మర్థకృతకాంతు న్వంచనాపూర్వభీ
కరచాటూక్తులఁ బట్టునంతనె గడీ ఖాలీయొనర్ప న్వ్రిపూ
త్కరము ల్నవ్వఁ బల్యాయనంబు మదిలోఁ గావింప నెంతా
టపా,టరుపాదర్పితుఁ డత్తురుష్కుఁ డనుచుక్ దకోడఁగా
నేటికిన్. 157

ఉ. కోరినయర్థ మెంతయినఁ గొమ్మని యీ నొడఁబాటుఁ జెంది

యు,న్నారము నేర మించుకయు నాయెడలన్ సరకారుప
ట్లలే, దూరక కూరికర్మమున గొప్పి వధూజనతానమేతు
లౌ, వారల మైన మాపయికి వారలు వత్తురె ద్రోహ
బుద్ధికిన్. 158

మ. అపరాధం బనుమాట లేనియెడ నర్థాపేక్షచే భీకరా
లపనంబు ల్బచరింతు రింతియ రణోల్లాసంబుచే నె త్తివ
చ్చుపను ల్వ్యాప్తపు బైక మెంతయిన నజ్జోడింప కర్పింతు మ
ర్థపుటాసం గమకించువారలక యుక్తంబు ల్దురంపుంబనుల్.

ఉ. కావున నిందుకై జడియఁ గాఁ బని యేమని యాత్మవర్గ
చిం,తావలమానసంశయకృతాఖలచింతలు మాన్పి పుచ్చి
ధై,ర్యావసధాయమానహృదయాంబురుహుం డయి రంగ
రాయధా, త్రీవరుఁ డుండె నంత రుషదీంద్రులఖానుఁడు
బూసి చెంగటన్. 160

తే. చేరి యిష్టానులాపము ల్సేసికొనుచు
రాచకార్యంపుసరళిలో రావువారి
ముచ్చటలు గొన్ని దెచ్చి సమ్మోద మొదువఁ
దాను రాజును డాసి మంతనము సలిపి. 161

మ. మనకున్ బందరునుండి వచ్చిన సుధామాధుర్యవాక్సంగ
తుల్, వినతిగ్రాహ్యము లిందుమీఁద నొకఁ డావెల్మాతఁ డ
ర్థాఢ్యుఁడా,యనచేఁ గట్నము పేరువాడుకొని యర్థాకృష్టిఁ
గావించి పైఁ,జనుట ల్పాటియ్యు. నా నతండు మది హర్షం
బందెఁ దద్రీతికిన్. 162

ఆ. అంత నపుడు వారలఖిలసైన్యములతోఁ
గసిమికోటఁ గదలి కదురయమ్మున

నొప్పు మిగుల నడచి యొడ్డాదిమీఁదుఁగా
బోయి దేవులపలిపొంతఁ దిగిరి. 163

చ. మనసరిహద్దునన్ మసలిమానుఁడు రాకొమరుండు బూ
సియున్,మొనకొన వచ్చి డిగ్గి రను ముచ్చట లందెను రా
వుగారి క,య్యనుపమధైర్యుఁ డప్పుడు రయంబుమెయిం
జెలికానివంశజున్,ఘనయశు వెంకభూధవశిఖామణి నంపఁ
దలంపు వేడుకన్. 164

ఉ. పోడిమి మీఱ రాముఁ డనుపూరుషుఁ జెట్టిలవంశజుం గ
డుం,దోడుగఁ గూర్చి సమ్మదముతోఁ దగు నుత్తరము ల్ర
చించి యా,తేఁ డనిచెం బ్రతాపవిధురీకృతసర్వదిగంతవై
రిస,మ్రాడుదయున్ దయామయుసమగ్రయశోహరిణాంకు
వెంకయన్. 165

చ. అతఁడును నేగి యయ్యవను నానతిఁ గట్టెదుట న్నిషణ్ణుఁడై
హితము నయమ్ముదోఁపఁగ నొకించుక కొంచక యుగ్గడించు
చో,నతఁడును గోపఘూర్ణితహృదంతరుఁడై నడిపె న్వెసన్స్వ
క్షితిపతికోటఁదా వెడలిశీఘ్రమె పోయెనో లేదొ నావుడున్.

ఉ. హైదరుజంగుతో ననియె నప్పుడు వెంకనృపాలమౌళియు
న్మానొరగా రొకింత యనుమానములేక కృపార్ద్రమైన మీ
యాదరణ న్మొలాజుమితుకై చనుదేరఁ దలంచినాఁడు స
మ్మోదముచేత రమ్మనెడి ముఖ్యముగాఁ దమకొలు వచ్చినన్.

తే. వచ్చినయనంతరమ్మున వారు తమరు
గలసి ముచ్చటలాడెడు గారవమున
వ్యగ్రత యనంగరాక మీవచనసరణి
నడపఁ గలవాఁ డతం డని నుడువుటయును. 168

చ. పలికెద వేల యిట్లు వసిబాలురతోడుత మాటలాడి న
వ్వులు పచరించినట్లు చనువు ల్నెరపే వది మంచిమాటగా
దలఘుపరాక్రమాతిశయు నాతనికోట వదల్చురీతిగాఁ
దెలియఁగవ్రాయుమిప్పుడని తీవ్రతఁజూపుచుఖానుఁడల్గుటన్.

తే. కన రొకించుక దొట్టి వెంకయ్య యనియె
రావువారికి నీకు పూర్వంబు వైర
మున్నదా యేమి కార్పణ్య ముప్పతిల్లు
కారణం బేమి నీకరయో ఖానవర్య. 170

సీ. సరకారుపట్టున దురహంకృతి వహించి
మరలఁ బాటుతనాన మసలినాము
పైక మీఁజాలక బాకీ కటాయించి
యొఱగొడ్డములఁ బల్కుచుండినాము
తమకు నిష్టముగాని దారిగ్రమ్మరుమతి
గోడించి రుజువుగా నోడినాము
నాఁడునాఁ డేమైన నయరహితము లైన
నడక లేమేనియు నడచినాము

తే. దొంగలము మేము యిలువెళ్లి తొలఁగునంత
పనులు మాకేమి నేరము ల్పంచినావు
సాహెబునుబావు నీ వను జంకు వొడమి
కాలు గావలె ననుటయే కంటకంబె. 171

క. స్త్రీబాలవృద్ధజనముల
తో బహుకాలంబునుండి దొరతనపుఁబసఁ
బాసి గీలుగొంటిమి
మీఁబోటినుచాలవద్దు మే మలఁతులమే 172

క. అవరోధజనముఁ దోడ్కొని
భువిజనములు నవ్వఁ గోటఁ బోనిడి పో హే
తువు మాకు నేమి నీకీ
యవివేకపుఁ దెరవు బుట్టెనగునా ఖానా. 173

మ. అధికారంబు వహించివచ్చిన సుబావామీఁద ఖావంద వె
వ్విధి నైన స్సరకారుశిస్తుఫణితిన్ విత్తంబు చిత్తంబురా
వ్యథలం గొల్పక కొందు నే ననక మీరాకోటఖేటింపుఁడన్
పథము ల్దప్పినవల్లు వల్కఁ దగునే పాశ్చాత్యలోకేశ్వరా.

చ. ఇఁక నొకమాట కోట వెడలించెద నన్న ప్రతిజ్ఞ నీకుఁ బూ
నిక యయి యుండెనేని ధరణీధవచంద్రునిఁ జిన్నవారితో
నకలుమవృత్తి బైట దిగునట్టుగఁ జేసెద నీవు వచ్చి కొం
కక బలుకోటలో డిగు సుఖంబుగ నస్మదరాతి దక్కఁగన్.

చ. పొగలుచు మీర లివ్విడలిపా మ్మను సుద్దులు కోటలోన
మా,పగతురఁ దెచ్చి డింతు మనుభాషణము ల్వివరించి చూ
డఁగాఁ, దగవులు గావు న్యాయితపథమ్ములు గా నవి మీకు
నిట్టి వి,య్యగణితపౌరుషాధికుల మా మముబోంట్లకు గావు
నర్హముల్. 176

శా. సాహంకారుఁడవై మదీయరిపువాహాపద్ధతిం బోయినన్
ద్రోహంపుం బనిఁ గూడఁ బెట్టుకొను చింతో నిక్కమా
నీకు సం,దేహం బేమిఁకఁ గోట వీడుటలు మా దేహాలతో
నొప్పలే, మాహోయిట్టిదురాగ్రహంపుఁబను లేలా స్వేల
ఖాన్ సాహెబా. 177

ఉ. నాయము దప్పి మీపయి రణంబొనరించుట కెత్తిరాము మా
యాయుతవస్తలు ల్దొలఁగి యన్యగృహంబులఁ గోరి పోము మీ

చేయఁ గలంతచేయుఁ డజుచే మును నెన్నుదుట న్లిఖించునం
తాయువు దప్పనేరదని యాయనరాయనిఁ జేరెఁ గ్రమ్మఱన్.

క. రంగారాయనృపాలుని
చెంగటికిం జేర నరిగి చెలికానికులం
డంగీకృతార్థ్వనిధి యై
సంగరమె ప్రధాన మనుచు సర్వముఁ దెలిపెన్. 179

తే. తెల్పి యచ్చిద్రకర్ముని తెఱఁగుఁ జూడ
బవరమున కోహటింతు నన్పులుకె కాని
సంధి కొడఁబడుమాటల జాడ లేదు
మీఁదటి ప్రయత్న మొనరింప మేలు మనకు. 180

మ. కలనైన న్మనకు న్దివాణముపయిన్ ఖడ్గంబు సారించుటల్
కలలోన న్విహితంబు గానియది నిక్కం బింక స్త్రీ బాలవృ
ద్ధుల దూరమ్ముగ నంచి పొంచికొని యస్తోకస్థితిం గోటలో
పలనిల్పామటుగానిచో ననిపడన్ భంగంబు వచ్చున్ నృపా.

ఉ. క్రూరత రాజు ఖానుమతిఁ గోమలమై చిగురొత్తఁగా మహా
వైరముఁ బెంచుచున్నెడ దివాణమువారు నయమ్ము దప్పి దు
ర్వారగతిన్ శతాంగహయవారణ ఘోరచమూశతఘ్నికా
వారముతోడ మిన్నొనుయున్వై ఖరి రానిటులుండ యుక్తమే.

ఉ. వెయ్యననేల రంగపృథివీవర జాగ్రతి నొంది యుండు లే
తియ్యము నెయ్యమైన మదుదీరితనీతి గ్రహింపు మంచు వెం
కయ్య వచించుడున్ నృపశిఖామణి యిట్లను డాగియుండినన్
దయ్యము నెత్తికొత్తలఁపు దప్పదుపో మన మెట్లు చేసినన్.

ఉ. వానికి చేరి భీకరత వానిజవాబులు వాని చెయ్దముల్, కానిక
గావు మీర లవి గన్గొని భీతిల నేల యర్థమెుల్లైన గ్రహిం

షఁగాఁ దలఁచి యాడెద రిందుల కెంతవింతమీ, కైనవిచార
మేమి చనుఁడా యని యించుక యూఁరడించుచున్. 184

క. విమతతగొని యొక్కడిదివా
ణమువా రెక్కడికి దూఁగి నడచిరయేనిన్
సమయానుగుణక్రమమే
గమనాగమనంబు లెన్నఁగా నుచితంబుల్. 185

ఆ. మనవిరోధి రాజుఁగాని వారువచ్చుచో
వెనుకఁ ద్రొక్కిపోవు టనుచితంబు
వీరవర్యు లయిన వెల్గోటిశాసనాం
కులవిధంబు గాదు తలఁగు చూడ్కి. 186

చ. మనగడిదుర్గపుంబలుపు వృత్కులధర్మము మప్పుఁ గొల్చుని
మ్మున గలయట్టిపోటరుల మొక్కలువోనిమగంటుము ల్భళీ
యన కిటులాడ నీకుఁ దగునా మృగనాభియలంది చంక లె
త్తనిఁకఁ బనేమి యాత్మబలదార్ఢ్యముఁదాగణుతింపనేటికిన్.

తే. ప్రధనభూములఁ బిరుదీక పగఱ నొడిచి
జయముఁ జేకొన్న సత్కీర్తి జగమెఱుంగు
రణము గుడిపిన వీరులు రావువారు
మార్తురకు దాలఁ దొలఁగుట మంచిపనియె.. 188

చ. వెలమ లమోఘవిక్రములు విశ్వధరాస్థలినందు నెల్లది
క్కులవినకారు రేచరల గోత్రులపౌరుషమందు రావువా
రల భుజశక్తి యద్భుతతరం బటుగావున నట్టిదైన యి
క్కులమునఁ బుట్టి రంగనృపకుంజరుఁ డొరసిలంగ నొప్పునే.

తే. వేపిఁ జేపట్టి గజరాజు విడిచినట్లు
గత్వరము లైనప్రాణముల్ గాచికొనుట

శామృగాంకార్కతారాగ్రహంబుగాఁగ
వెలయు సత్కీర్తిగోల్పోవ వెట్టిగలఁడె. 190
శా. లాసూముఖ్యులకెల్ల నొడ్డుగరసాలావారియెల్గోల్తుపా
కీసామానుగుజాలపౌఁజునకు రాకొక్కసర్యపాలంభదో
ర్వ్యాసంగంబు వరింపఁ దాండ్రికులజాన్వప్రంబరాబాకుగా
జైసాచర్ బురికొల్పి శాశ్వతయశస్సంపాదినై పొల్చెదన్.
ఉ. ఆదిమవీరయోధతతి నైన వెరం గొనరింపఁజాలు మ
త్సోదరుఁ డల్ల నావిమతశూరవరేణ్యులు వల్గతంబులౌ
నాదినిశీలతత్తదధిపాగ్రణు లైనఫరాసువారి నా, హైదరు
జంగు నొక్కమొగి నాహుతిసేయఁడె రోషవహ్నికిన్. 192
ఉ. ఈగడిదుర్గ మీగయిత లీ తెలఁగాబల మీతుపాకిబా
రీగజవాజిరాజితతు లీమనబాంధవవర్గ మీయురా
బాగమి యీముకుందపురిబల్లెపురాణువ రిత్తబోవునే
భూగగనంబు లొక్కటరి బొక్కపడర్ జగడంబుఁ జూపకన్.
తే. ఇంత సామగ్రి గలిగి మీయంతలేసి
మడమ దిరుగనిమగటిమి మూరుమనలు
పద్మనాయకబలముతోఁ బగతు రెదుర
మార్మొగము జూప బాపురే మనల కగునె. 194
చ. అని బహుభంగులం దనబలాబలదర్పవిజృంభణంబునే
ర్పున వివరించి పైననియె భోరున నేచెయి మించె నాధరా
జనము నుతింప నిప్పుడమి నర్వాశు నేలుదు వారిచేయి మిం
చిన సురరాజ్య మేలుదుఁ బ్రసిద్ధముగా నకుటుంబినై కడున్.
క. మాతో పాటున కొడఁబడి
భీతిల్లక నిలుచువారిఁ జేర్కొన నేలా

యూతెఱఁ గొప్పనివారలు
చేతఃప్రమదంబుకొలఁది సేయుం డనుచున్. 196

క. ఆజికి పై కాపని యా
రాజున కెదురొడ్డఁజేసి రాజాంకోటం
దేజమునఁ దాండ్రపావ
త్మాజానిం గుదురుకొలిపి సంభ్రమ మొసఁగన్. 197

సీ. నక్తందివంబును నాదుపాదుకొనంగ
సాహేబునౌబత్తు చరుపఁబనిచి
కడుగడీపై నలంగముచుట్టు నెల్లెడ
గస్తు గ్రుమ్మఱునట్లు గట్టిపఱచి
బురుజులమీఁద నిష్ఠురతర్కాయోధన
సాధనసామగ్రి పాదుకొల్పి
బిరుదువస్త్రాదులఁ జేర్వేఱ నాడాడ
ముస్తాదుగా నిల్పఁ గుస్తరించి

తే. యసి ముసల కుంత పరశు పట్టసముఖాది
పరుషహేతిచ్ఛటల కెల్ల బదను దీర్చి
తగుబలస్తోమములతోడఁ దగినరీతి
రావుకులహేళి యుండె బీరమున నంత. 198

సీ. తురగరింఖాముఖోద్ధూతభూతలరేణు
జాతంబు దిశకిఁ బ్రచ్ఛదము గాఁగఁ
గరిఘటాపటలఘీంకారనిర్ఘోషంబు
గర్జారవమ్ముల గారవింపఁ
జటులధ్వజానీకఝుంపాప్రకంపిత
ప్రతతియభ్రావళిఁ జాఱఁదోల

రథచక్రనేమిపరంపరాఘాతకా
        తదితమై పాతాళతలము బెగడ
తే. నగణితాయుధచయధగద్ధగితకాంతి
సవితృబింబంబు నొరఁబట్టుజాడఁ దెలుప
రాజమఃశిసంగతముగా ఫరాసుబలము
లగ్గడీడగ్గరకు డాయ నరుగుదెంచి. 199

క. గవ్యూతిమాత్రనికటత
లవ్యుత్పాదితవినిర్మలస్థలసరసీ
దివ్యోదపానవిగతప
థవ్యథులయి సేద దేఱి తద్దయుఁ బ్రీతిన్. 200

సీ. జలజపత్రాంచలచ్ఛాయావినిద్రిత
        కమనీయకోకస్తనముల దానిఁ
శైవాలనీలరోమావళీవళితని
        మ్నాభిరామావర్తనాభిదానిఁ
జంచరీకోత్కరచ్ఛదరుచికజ్జలాం
        తరితాంబుజాతనేత్రములదానిఁ
గాదంబవలయకాంచీదామవేష్టన
        ప్రబలసైకతనితంబములదానిఁ
తే. గంటి కింపైన నెచ్చెలివంటిదాని
నచ్చెరువు గాంచి యచ్చెరు వందుకొనుచు
నిలిచె నచ్చేరువన నవనీపకుటజ
తరువరశ్రేణినీడలఁ దురకబలము. 201

ఆ. రాచపుడమితేఁడు రాజిల్లి తత్తటీ
కాంతసీమ నొక్కకాంతమైన

రాతిగుట్టయొడ నరాతిభయమ్మున
నండ యిది యటంచు దండు విడిసె. 202

తే. అట్లు విడి మట్టుసేయ దిగంతదంతి
కర్ణకోటరపాటనక్షమ వహించి
మన్నెహంవీరకోటలో మిన్నువగుల
మొఱయు సాహెబునౌబత్తుకరము దనరె. 203

తే. కఱకుములుకులచాడ్పున నుఱకమొఱయు
నాదువీన్గవడాసి నోనాఁటిపాఱఁ
బారసీకవతంస మపారరోష
భీషణారుణితాక్షుఁడై బెదరి లేచి. 204

మ. వితతోద్వృత్తికనీనికాభయదదుర్వీక్షాకృశాను ద్విని
ర్జితహిందూవసుధాధిపవ్రజమహాసేనావధాను సము
ద్ధతమాయామయవాఙ్నిధాను నతిరక్తశ్మశ్రుసంతానవ
ల్లితవక్త్రోపరిదోర్విధాను హసనల్లిఖాను నీక్షించుచున్.

సీ. ప్రళయకాలపయోదపటలీపరిస్ఫుర
ద్గర్జాసమూర్జితాఖండశక్తి
శైలశిఖాతటస్ఖలితగండోపల
జనితనిర్ఘోషప్రచండపటిమఁ
బురభిదుద్యత్కఠారిభోరుహోచ్చాలిత
కల్పాంతఘోటకానికామకలన
మందరక్షోణిభృన్మథితమహార్ణవ
ఘుమఘుమారభటీకాగుంభనంబుఁ

తే. దెలుపునిదియేమి కలకలం బలుకు వినుచు
ననుచు రా జడ్డగోలుగా నగ్గడీని

వెగ్గలంబుగ మ్రోయించు వెలమతేని
యనుపమంబైన నౌబత్తు వినద మనిన. 206

క. కసరుట్టియుట్టి పడుచు
న్విసు మొల్కడు వేఁడిచూడ్కి వెదఁజల్లుచు న
ల్లైవ లారసి యిట్లను నో
హాసనల్లీఖానవర్య యనుపమశౌర్యా. 207

శా. నీ వచ్చోటికి నేగి యప్పుడమితేనిం గాంచి నోనాడి యీ
క్రేవం డిగ్గినవాఁడు సాహెబుసుబా కేలా చకిట్టుల్భయా
భావంబైన మనంబుతో నుదుటు నౌబత్తుం బజాయించుచు
న్నా విక్కార్యము మాని యింకగడిలోనన్ లేచి పోనో
డవో. 208

క. అని తెలియ నడిగి రమ్మని
ఘనకోపనిరీక్షణంబు గదురఁగ ఖానుం
డనిపినఁ జనువేడుకతోఁ
దనదూత్యద్రఢిమ ఖావులఁ దనివి సొరంగన్. 209

మ. మురువై పేర్చు కడానివన్నియ జరీముస్నాలు పుస్తుంగుబం
గరుపల్లంబు నిగారపుంబనితరాకల్లెంబు విన్నాణపుం
బిరుదు ల్దిద్దిననిద్దమౌ నొకయరబ్బీ నెక్కి చౌకంపుఁ దా
ల్మి రహిం జొప్పడ నేగుదెంచె హసనల్లీఖానుఁ డామోదియై.

ఆ. అతనిరాకఁ జూచి హర్షించి కంచుకి
దెలుప నరిగె నంత నిలుపరాని
సమ్మదంబు పొంగుఁ జంద్రోదయారంభ
వేళ జలధిఁ బోలె వెలమదొరకు 211

తే. హర్షమగ్నాంతరంగుఁడై యానృపాలుఁ
డతని కెదురేగి కౌఁగిట నామతించి
తోడుకొనివచ్చి యొక్కయస్తోకచిత్ర
కంబళావృత మైనకూటంబులోన. 212

క. ఆసీనుఁ జేయ నాతం
డాసారసుధారసాయితాసారసము
ల్లాసంబు నెఱపు నిష్టక
థాసల్లాపములఁ గొంతదడవు వసించెన్. 213

వ. ఇవ్విధంబునం బ్రొద్దు జరపి యిష్టకథాప్రసంగంబులవలనను గణికానికాయనటన చమత్కారజనితాభంగురవిలాసతరంగంబులవలనను నంతరాంతరంబుల నయ్యనంతాకాంతుం డాసంగు నుడుగరలవలనను గుతుకం బంతరంగంబునం బొడమనీని యంగీకారానంగీకారంబులు కార్యసౌకర్యానంతరకరణీయంబులుగా నెఱుంగం బలుకుచుం దనయేలిక యనిపిన రాకరాకానిశాకరప్రతీకాశుం డగు నమ్మన్నెదొరకు నెఱుకపఱచినం గనలి యతం డతని కిట్లనియె.

చ. ప్రబలతరప్రభుత్వమున భాసిలుపాదుషహా యొసంగఁగా
నిబిడతమప్రభావమున నేర్పుమెయిం గొనినాముగాని సా
హెబునవుబత్తుదీసి నెవరేని యెఱుంగక యుండ దొంగవే
డబమునఁ దెచ్చికొంటిమె తడంబడ కిట్టు లనంగ న్యాయమే.

మ. బలవంతమ్మున నన్యులం గదిమి యప్రామాణ్యదుర్నీతిచే
నిలు వెళ్లఁపుచు నాక్రమించుకొనలే దిచ్చోటు గాణాచిగా
నెలవై యుండెడు తావు మాకిదియ యున్నె నావద ల్వచ్చినన్
వలనల్పోయి యెఱుంగ మేమివనిగా వంచింప నిప్పల్కులన్.

తే. ఏడుమూఁడుతరంబుల నిండెయుండి
యాపదలు వాపికొనుచు భాగ్యానుభవము
గొన్న వారముగాని యీకోట నదలి
పోవుట యెఱుంగ మకట యీపూటదనుక. 217

శా. మా కత్యంతవిరోధిరాజతని సన్మానించి చేపట్టి మా
రాకున్నట్టి దినోబతు ల్సలుపుట ల్ప్రాధాన్యము ల్గాగ న
స్తోకప్రౌఢిని నీరుకాకినెపము ల్జోడించి పల్కా ఆయో
హాకీము ల్దమ రిట్లు పల్కుటకు నర్హంబే విమర్శింపకన్.

శా. లక్షద్వాదశశుభ్రదానకలితోల్లాసంబున న్శ్రీమనం
బక్షీణప్రభచేఁ జెలంగ భవదీయాంచత్కృపాపాంగస
ద్వీక్షావైభవ మంది మద్విషతపృథ్వీజానిమాకోట నేఁ
డక్షుద్రోద్ధతిఁ గైకొనం దలఁచెఁ గాదా భూరివైరంబునన్.

ఆ. మమ్ము గెలిచికాని మాకోటఁ జేకొన
నేరఁ డెంతయేని వీరుఁడైన
శూరధర్మమునకుఁ జొప్పడు నగురీతి
బారుదీర్చి నడచి పోరుటెందు. 220

చ. నలువదివేలకాల్బలమున న్బలవత్తరుఁడైనవాఁడు రా
ట్కులమణినాల్గువేలుదళ గొల్వఁగ నుండెడువారమేము వా
రలపసమత్ప్రతాపము దురమ్మున బారునఁ గాని కానరా
దలఘుమనోవినోదగతి నారసి తారసిలించి చూడుఁడీ. 221

క. ఆరాచవారి మమ్ముఁ
బాఱునకుం దీర్చి యొక్క పసిమినిశానీ
వారలచేతికి నిచ్చిన
ఘోరాహవ మోర్చి దానిఁ గొంటిమ యేనిన్. 222

చ. పదపడి మాయధాస్థలికిఁ బాత్రులఁ జేయుఁడు మమ్ము లేకయు
క్కదనమునందు నోడి తిరుఁగంబడి చచ్చితిమేని మీర లె
య్యది యపరాధ మూన్చినఁ దదర్హత మాజ్ఞకునియ్యకొల్పి
యుం, డెద నిరువాగువారల కడిందిమగంటిమి కాన నయ్యె
డున్. 223

మ. అది గాదేని యతం డొసంగుధన మెంతో నంతకే నిబ్బడి
చ్చెద నారాచకుమారుఁ డేలు పురితత్సీమాసమేతంబుగా
మదధీనం బొనరింపుఁడెంతయును ధర్మప్రక్రమం బంచు నె
ల్లిదమౌ సాహసిరావు పల్కె హసనల్లిఖానుఁ డాపిమ్మటన్.

ఉ. మన్నెకుమార నీనిరుపమానవచోనియమంబు నీతిసం
పన్నతగల్గు వారిచెవిఁ బట్టెడుఁగాని దురాగతోద్ధతిం
జెన్నెసలార మీపగతుచే మునుపల్కఁగనైన కొండెముల్
విన్నకృతఘ్నుఁ డెవ్విధిఁ జెవిందవిలింపఁగ నోపునన్యమున్.

చ. అకలుషసాగరాంతవసుధాధిపుఁ డయ్యుఁ దురుష్కుఁ డయ్యుఁ
బై,నొకరిదురుక్తి డెందమున కొప్పిదమై ప్రసరించి యుం
డియుం,బ్రకటితవైరబద్ధుఁడయి భాసిలునప్పుడునిప్పుడొక్క
కోఁ,తికి శివమెత్తుచందమది ద్రిప్పుట కేరితరంబు భూవరా.

చ. భవదభియాతి కిచ్చెనఁట బాసపదార్థపుటాన మున్ను గై
దువుఁగొని ముట్టి తప్పడనితోఁచుచునున్నది దాని నింక న
య్యవనుఁడు దుష్టమానసుఁ డహంకృతిచే నభిమాన మూది
పై,నెవరును జెప్పిన న్వినఁ డదెట్టిమతంబకో రా దెఱుంగఁ
గన్. 227

మ. ఇది దుస్తంత్రము దీని కియ్యకొని నీ వీపద్ధతి న్రాచవా
రిదురాలోచన వింట ముంచిపనియే కేచెర్ల గోత్రియుఁ జే

మి దివాణానకుఁ దప్పుఁ జేసె గతమే మీవారి వేధింప నీ
యుదితక్రోధరసంబుడింపుమని వేయుం జెప్పినా రందఱున్.

చ. పనివడి వారితోడిచలపాదితనంబు వహింప నేల పై
కొని చనినేని త్రొక్కటముగూడును వైచినయట్లు వైచినన్
మొనకొని వేదురైనను నమోఘముగా జయమందు నంద్రె
గా,వున ధరణీశముంటములు వుచ్చిన మేలునుమీ తలంచి
నన్. 229

చ. విను మిసుమంత మామనవి వింతయొనర్పక యొక్కమాన
మీ,వనుపమధైర్యమంది చని యంతట నంతట యుండి తేని
యే,నినుఁ గొనివచ్చి క్రమ్మఱను నిల్పెద నీదగు కోటలోన నీ
మనమున సంశయింపకుము మన్నెకుమార శిరోవతం
సమా. 230

ఉ. వారు దివాణమాట బలవంతుల రింతటి కెన్నఁగా జమీ
దారులు మీర లట్లగుట దాష్టికమెల్లను వారిసాష్మహం
కారము మీకుఁ జెల్లుబడిగా నొరగొడ్డము లాడి యోర్వఁ
గా,లే రెవరేని వారి కదళీదళకంటకసామ్య మాటచేన్.

సీ. కేకయాత్మజచేయు కృత్రిమంబునఁ గాన
బాములఁ బడఁడె శ్రీరామమూర్తి
గడుసుయోధనుచేత నిడుములఁ గుడువఁడే
ద్వైతవనంబున ధర్మసూతి
కలికృతంబైన దుష్కరబాధ నొందఁడే
లలనాసమేతుఁడై నలవిభుండు
గాధిసూనుఁ డొనర్చు కష్టికి నోర్వఁడే
సతియుఁ దానును హరిశ్చంద్రనృపతి

తే. యక్కటా యెంతవారి కొక్కొక్కవేళ
గ్రహగతులు దప్పి వచ్చును గష్టపడియు
దుద శుభం బందరొక్కొ యాపదల కోర్చి
సంపదలఁ గాంచు మనెడుశాస్త్రంబు దలఁచి. 232

ఉ. కాన నృపాలవర్య తురక ల్బలవంతులు వారితో విరో
ధానకుఁ బోవఁగూడ దది తథ్యము సామము దాన మాదిగా
నైన నయమ్ములన్విజయ మందఁ దలంచుట మేలగు న్నయు
ద్ధే నకథాచ నేతి బుధుడేయని శాస్త్రము మీఱెఱుంగరే.

సీ. బ్రాహ్మణ ద్రోహంబు పరమధర్మవిచార
మన్యాంగనాసక్తియాత్మశుద్ధి
వృత్తివిచ్ఛేదంబు విహితసదాచార
మన్యాయవర్తనం బధికతపము
నిత్యకర్మము మేదినీజనక్షోభంబు
ధార్మికపీడ హితవ్రతంబు
దుష్టభాషణము లభీష్టదైవస్తుతు
లేకావలనియమంబు దేవఘాత

తే. మ్లేచ్ఛులరు నిక్క మందులో మెఱుఁగు పాతి
పాటిదప్పిన దుర్గుణప్రాణి యైన
వానితో నీకుఁ జలమేల వలదు వలదు
తొలఁగి చనుటయె ఘిగుల సంతోషమనుచు. 234

చ. నయము భయమ్ము దోఁప యవనప్రభుడూతి వచించుచుం
గదుర ,రయమునఁ గోపచిత్తుఁ డయి రంగన్నృపాలుఁడు నిట్లు
నుర జయాజయములు దైవవేద్య మని శౌర్యముఁ గల్గిన

వార లొప్ప రీ,క్రియను బరాఙ్ముఖంబునకు గేవలశాత్రవు
లెత్తి వచ్చినన్. 235

తే. మాననీయతఁ గాంచి యస్మద్విరోధి
జవనయవనాశ్వికులతోడ సంభ్రమించి
యెత్తి వచ్చినయపుడు మే మొత్తిగిలుట
రావువంశంబు దుష్కీర్తితావుఁ గనుట. 236

ఉ. కావున మీర లెంతనయగౌరవభాషణము ల్రచించినన్
భావమొకింతయు న్విముఖభాసము గాంచదు మాకు శౌర్య
సం,భావితకీర్తియా వెలమపట్టికి ధర్మము గానిరీతి యే
లా వచియించు టద్ధకృతలంపట మొప్పెద నెంతయేనియున్.

మ. ధృతి సర్పింతుఁ బదార్థ మెంతయిన నిర్దేశించినం బైనసం
గతముల్ప్రొరుషహానికృత్యములు దుర్గంబిచ్చి పొమ్మంట నె
బతుజాలించుమటంట వీనికి నొడంబా టొందుట ల్లేవు మా
మతిలోఁగీర్తిధనాఢ్యులెందుబిరుదుల్మాయింతు రేయుర్వరన్.

క. బిరు దుడిగిపోవుకన్నను
మరణంబే మేలు మాకు మఱియు విచారం
బగయఁగ లే దిది తుదివ
త్సర మనికొనియెదను దీన సందియ మేలా. 239

క. బుభులోకవిభునియంతటి
శుభలక్షణలక్షితునకు సాలిగెనె నహుష
ప్రభవాపత్పృథయిప్పటి
కభిమానం బెడలుకంటె హైన్యముగలదే. 240

తే. అర్థ మింతైన నిచ్చెద మంతమీఁద
నొడఁబడఁడయేని ప్రాణము ల్విడుచువార

మంతయేకాని పౌరుషహాని గొప్పి
వెడలనోపము దీనికి నడల ననుచు. 241

మ. నయసంధాయకచాతురి న్మెలఁగుశౌణ్డావైతివా యర్థని, ర్ణ
య మేర్పా టొనరించి సంధియ యొనర్పం జూడు మీవింక
దు,ష్క్రియకుం బూనిన వానిఁజెంద మదిచక్కం జేర్పలే
మన్నచోఁ, బ్రయిలోడం జనదంతమాత్రలకు మీబోం
ట్లెందు రాఁజెల్లునే. 242

క. మంచిది మాకర్మము వై
రించనకృత మెట్లొ యట్టిరీతిని జనుగుం
గొంచక చనుఁడీ యన మే
లంచు న్హాసనల్లిఖాను దర్గెం దిరుగన్. 243

శా. రాజీవాసనవంశసంభవశిఖారత్నంబు నాఁ బొల్చు నా, గో
జీరాయఁడు రాజు మేటితురక ల్గూర్చుండఁగా నోలగం, బై
జంభాసురుపోల్కి నుండెడు సుబాపజ్జం బ్రవేశించి కే, లీ
లైవాత్మకుఁ డైనవాఁడు హాసనల్లీఖానుఁ డుత్సాహుఁడై.

మ. ధన మొంతైన నొసంగువార మని యాథార్థ్యంబుగాఁ గో
ట యీ,మని నౌబత్తుసడల్ప నోప మని యన్యాయంబుచే
నెత్తివ,చ్చినఁ బ్రాణంబుల గానఁజెంద మని నిశ్చింత న్సముం
జంపఁ జూ,చినఁ జచ్చె మని పల్కినా రవల మీఁచిత్తం బనం
గ్రుద్ధుఁడై. 245

తే. తోఁకఁ ద్రొక్కిన యురగంబుతో సమత్వ
మూని హైదరుజంగు దుర్మానగరిమ
రాజు వినుచుండ నంతంత రాఁజునగ్ని
చుట్టుల రవులొత్తుచుఁ బల్కె నిట్టు లనుచు. 246

క. ఫల్లా కానిప్పుడా
ఖిల్లాకిల్లాకు నడఁచి కించిన్మాత్రం
హల్లాకు నూలుకొలుపుచుఁ
జెల్లాకుం జెదరఁ జేతు శీఘ్రమె వారిన్. 247

ఆ. అనుచు నుడువునంత హసనల్లిఖానుఁడు
హసితవదనుఁ డగుచు నతని కనియె
నీకుఁ దగునె యిట్టినీతిశూన్యం బైన
జాడ పలుకుఁ బలుక సాహెబేంద్రా. 248

మ. వయికం బీమనిరో దివాణముపయి న్బాహాబలోద్వృత్తిచే
నయము ల్దప్పినచెయ్దము ల్నడచిరో నమ్మించి రమ్మన్న ని,ర్భ
యులై రాక పరాకుచేసిరొ శిరోభారంబు నీ కేమి దు,ర్ణయ
ము ల్రాజు వచించుకొండెమున నన్యాయంబునం గ్రమ్మఱన్.

మ. వెలమల్వా రభిమానవంతులు జగద్విఖ్యాతచర్యు ల్వి,స్తు
లశౌర్యోన్నతు లాపయిన్ నిరపరాధు ల్వారిపై నిర్నిమి,త్త
లసత్క్రౌర్యవివర్ధమానవిపు లౌద్ధత్యంబు వాటించి ని,శ్చల
మా నీచలమూదు లెల్ల నివి నీసర్వాధిపాహంక్రియల్. 250

ఉ. తప్పులు లేనివారియెడఁ దప్పు ఘటించి నిరర్థకంబుగా,నో
ప్పని పూనికం గినుక యూనినఁ జేకుఱు నెట్లు నీతలం,పప్పు
రుషప్రతాపవిజితాఖిలవైరి నియుద్ధులైనవా,రెప్పగిది న్వ
శం బగుదు రెందఱ నొంచెదరో దురమ్మునన్. 251

మ. బలవంతంబున వారిపై నడచి చొప్పంజూచిన న్వార లె,ట్టుల
నిన్నోర్తు రనేకవృద్ధశిశుబంధుప్రాణశుద్ధాంతకాం, తలతో
నుండెడివారిగీములపయి న్దర్పించి యుద్ధార్థులై,సిల కిట్లేగుదు
నన్నమీఁదట ఖోదా నిన్నెట్లు గావించెడిన్. 252

మ. గడిదుర్గంబిది వానిపై నడరు రంగల్లోహనాళావళుల్
పిడుగుల్గ్రాసినయట్టిపిట్టలముగా భీమోద్ధతి న్వ్రేఁడి గు
ళ్ళ దలింపంబడిపోవవే పిడుకవేట్లాటాసుబావన్న నీ
చెడుగు ల్వైరికి నోడునే యరుగునే చిచ్ఛమ్ము దాకిమ్మహిన్.
తే. ఎదిరిచావును దనచావు నెఱుఁగకుండ
వెలమవర్ణంబు తెఱఁ గేగు వెఱ్ఱిగలఁడె
భీతిలఁగఁ బైకి వా రిట్టి బెడద డాసి
వచ్చుచో నిల్తురే పిన్నవారితోడ. 254
ఉ. వారలు ధర్మమార్గ మెడఁబాయక పైక మనేక మిచ్చుచు
న్నారమ నాయనాదరమున న్గ్రహియింపక పండువంటిసం
సారులయింటిమీఁదికతిసాహసవృత్తిని జంప నేగు దు
ర్వారతరాఘమిప్పుడ యవారితమై నినుఁ జుట్టుముట్టదే. 255
క. కులహానిపాపహేతువు
కలహం బరయంగ యశము గలుగదు దీనిన్
వల దుడుగు మంచు నెంతయు
నలుక న్వాసనల్లిఖానుఁ డాడినపిదపన్. 256
తే. కొలువునం గలవారు నాగోజిరాయఁ
డాదిగాఁ గల్గువారు న్యాయంబుదోరల
నట్ల పల్కిరి యుదుటురా జంతలోన
చిరివిసపుమాట ఖానునిచెవినిసోఁక. 257
తే. వీకుసరకారుతాజమీందారుఁ డరయ
నెదిరిసత్వంబు తనసత్వ మెఱిఁగికొనక
వాకుముచొప్పున నడవక వికటమతిని
దిరుగఁబడి యుంట సతనంపుఁదెఱఁగె యనియె. 258

తే. అట్టిపలు కాలకించి యయ్యార్యులెల్ల
విన్ననై యున్నకుండి రానన్న యెఱిఁగి
చెన్ను మిగిలెను ఖానునిచిత్తవృత్తి
మంటకును వాఁడిపెట్టి నట్టంటరాక 259

ఉ. అంతటఁ గొల్వు వారలు నిజావసథంబుల కేగి రుగ్రతా,క్రాంతమనోవికారు లయి ఖానుఁడు రాజును లక్ష్మణాఖ్యుఁడా, చెంత వసించు బూసికి వచించిరియాయనయాప్రసంగమా,ద్యంతము వించు నప్పుడె దురాగ్రహుఁడై సెల విచ్చె నాజికిన్.

ఉ. సూరిజనస్తవార్హిత సుశుభ్రియశోజితపుండరీకడిం
డీరమరాళనారదపటీరమహేశ్వరహీరతారకా
సారతరంగిణీదరతుషారహిమాచలశేషశారదా
శారదచంద్రచంద్రహరిచందనకొండలరాయనందనా. 261

క. దివ్యద్రుమకుసుమసమ, ప్రవ్యక్తసుగంధసారభాసురకీర్తి
ద్రవ్యార్జనాతివికస, న్నవ్యమనఃపద్మపద్మనాయకతిలకా.

మాలినీ. శ్రుతశిఖరిగుడాద్రిక్షోణిభృచ్చక్రవర్తీ
సతతనిఖిలధర్మస్థాపనోదారకీర్తి
వితరణకృతసద్యోవిద్వదాశాప్రపూర్తీ
శ్రితజనివశలీలా సేవధీభూతమూర్తీ. 263

గద్యము. ఇది శ్రీమత్కాశ్యపగోత్ర దిట్టకవివంశ పవిత్రాచ్చ
నామాత్య పౌత్ర పాపరాజకవిపుత్ర శ్రీరామచంద్ర చర
ణారవింద ధ్యాన పరాయణ నారాయణాభిధానప్రధాన
మణిప్రణీతం బైన రంగారాయకదనరంగచరిత్రం బను
మహాప్రబంధంబునందు ద్వితీయాశ్వాసము.

---

శ్రీ ర స్తు.

శ్రీ హయగ్రీవాయనమః.

---

# రంగారాయచరిత్రము

## తృ తీ యా శ్వా స ము.

---

క. శ్రీకామినీపదాబ్జతు
లాకోటిస్ఫుటఝళంఝళారావయుత
శ్రీకరనిజమణిమందిర
రాకాచంద్రోపమేయ రామారాయా. 1

వ. అవధరింపు మవ్వలికథావృత్తాంతం బెట్లుండె నని నిలింప భర్త యత్తాపసప్రవరు నడిగిన నతం డతని కిట్లనియె. 2

శా. మూసాబూసియనుజ్ఞఁ గైకొని మహామూర్ఖాత్ముఁడౌ ఖానుఁ
డుల్లాసం బేర్పడఁ బారుదెంచి రణలీలావ్యగ్రచేతస్కుఁడౌ
లాసూముఖ్యుల గొప్ప గొప్ప సరదార్లన్ వేగ రప్పించి య
త్రాసాటోపవిజృంభితాగ్రహసముద్యన్మూర్తియై యిట్లనున్.

క. ఆహవమున ధైర్యరసో
త్సాహంబు వహించు సాహసప్రాణులు మీ
బాహాబలంబుఁ జూపుఁడు
మోహీ మరుదెంచె నిదె సముసుఖ మగుచున్. 4

చ. మొనఁగల మేటిమానవుల మోఘపరాక్రము లద్రిధైర్యులి
య్యనుపమదుర్గసాధనరణాయతసంయదుపాయశాలి వం

చనఁ దగువారు మీరలని సన్నుతిఁ జేసి తదర్హవస్త్రవా
హనబిరుదప్రధానములనందఱఁ దేల్చెముదంబురాసిలోన్.

వ. ఇవ్విధంబునం జాంబూనదాంబరాభరణతాంబూలంబు
లొసంగిన నంగీకరించి సంగరరంగప్రసంగంబునకుం గు
తూహలంబు వొడమి సన్నద్ధులై పరఁగుచు. 6

మ. ముహురన్యోన్యవిలోకనప్రభవసమ్మోదాతిరేకస్పృహా
రహితాత్మీయవిచారసూచకపరిమ్లానాననాంభోజులై
రహిఁజూపట్టియు వారలొప్పి రతిదుర్వారాస్త్రశస్త్రిసిసం
గ్రహణావ్యగ్రరణార్భటీపటుతరకార్యాతినిశ్శంకతన్. 7

తే. అపుడ రంధ్రశ్రుతిప్రభునాజ్ఞ వడసి
తడసి కొన కేగి పడవాల్లు ఢండువెంట
గడిఘిరాయించి సైనముల్ గండటంచు
సైనికులకెల్ల మోహీముసాటి రపుడు. 8

చ. అతనియనుజ్ఞచొప్పునన యాహవకేళికి నెల్ల సైన్యముల్
జతనములై జతల్పడి విశాలముగాఁ దగు మందుగుండు న
ద్భుతతరలోహనాళవితతుల్ జినిసీదిసుసాఫిరంగు లా
యితమొనరించి యశ్వముల నేనికలం గయిచేసి రేర్తైఱన్.

వ. మఱియునుం జమూనమూహంబులు శిరస్త్రాణకంకటంబు
లును శరశరాసనఫలకంబులును పరశుపట్టిసప్రాసముసల
ముద్గరపరిఘకరవాలక్షురికాచక్రప్రముఖనిఖిలప్రహ
రణప్రకాండంబులును భండనోచితమండనంబులును ప్రచం
డగతిం బొలిచి రణపాండిత్యంబుఁ దెలుప సన్నద్ధులై తమ
తమవాహినీనాయకులచెంగటం గుతుకంబు నినుపుచు
నిలిచియుండి రయ్యవసరంబున.

ఉ. బాహుజచక్రవర్తిపరిభావితగాండివధన్వుఁడై రణో
త్సాహముతోఁ దురంగమగజవ్రజవీరభటోత్కరంబు లు
గ్రాహవదోహళం బయిన కాంచనరత్నకిరీటముల్ నది
త్కాహళరాజియుల్ మెఱయ ఖానుఁడు మెచ్చఁగ వచ్చెఁ
గ్రచ్చఱన్. 11

శా. సారాహంకృతిమన్నిరంకుశగతిన్ సంగ్రామరంగస్థలిన్
రారాజన్నవవిక్రమార్కు లనఁగా రాజిల్లువారెంద తే
పేరుల్గాంచి వెడందరొమ్ములవయిన్ పిస్తోల్తుపాకీలతో
శూరాగ్రేసరులైన మూసలు ఫరాసుల్ వచ్చి రుగ్రాకృతిన్.

చ. జవజితవైనతేయములు సాహిణము ల్సులతానుచూడ్కికిన్
దవిలిచె నర్తరిన్ ముదము ధారితరేచితవల్గితప్లుత
ప్లవనపులాయితాదిగతులన్ కలికాముఖవల్గువల్గన
ప్రవణమనస్కసాదిజనభావపదంబుల నాశ్రయించు-నన్.

మ. ప్రతిపక్షప్రబలావలేపహరణప్రజ్ఞాసమగ్రంబుల, ప్రతిమ
ప్రస్తుతగండమండలమదాంభఃశీకరామ్యచ్చమూ, ధ్వత
రేణూద్గమముల్ ప్రతప్తకలధౌతోద్దీప్తభూషాపరి, ష్కృత
ముల్ మత్తకరీంద్రముల్ మిగులరాజిల్లెన్ సుబా మెచ్చఁగన్.

చ. పృథురభసంబున న్మొఱసి భీషణఘోషణదూషణక్రియా
బధిరితదిక్ప్రఘూణములు భర్మమయావయవాతిరమ్యము
ల్మథితవిపక్షపక్షబహుళప్రతివీరవిభంగరంగముల్
రథముల సంఖ్యసంఖ్యలు ఫరాసులయేలికచూడ్కికింపుగన్.

చ. అతులనిశాతహేతిరుచు లాకసవెల్లను నాక్రమింప ను,ద్ధత
గతి నేల యీనినవిధమ్మున లెక్కకు వెక్కసంబుగా,నతనికి

వేడ్కఁ నించిరి సితాసితపీతపిశంగకంచుక, శ్రుతతులఁ దాల్చి
చుఁ యవనబర్బరమల్కపుళిందపుల్కసుల్ 16

మ. కదనక్షోణికిని త్రైటంగున మొనల్ గట్టాయితంబై నదుర్మదుఁ
డాసాహెబు సర్వసైన్యములలో మాద్యద్భుజావిక్రముం, డు
ద్యద్ఘాటోపియితండటంచు నొగిలాడూఖాను నేమించెన, న్మద
మొప్పన్ దళవాయి వీవ యని సన్మానింపుచున్ గ్రచ్చఱన్.

శా. లాడూఖాను కుమందముం బటురణాలంఘ్యప్రతాపోజ్జ్వల
త్క్రీడాదర్పితు నివ్విధంబునన నీకిన్యగ్రణిం జేసినన్, వాడున్
జూడఁగ నొప్పె రావణబలవ్రాతంబులో తొల్లి య, ప్రీడన్ గ
న్పడు మేఘనాథుని మహోద్వృత్తి న్విడంబించుచున్. 18

మ. మదదంతిప్రతిమానదేహలతికామం దేహుజండ్రాల్మహా, న్మ
దుహుస్సేనుమయూరుశాత్ర వచ మూ మత్తాహిదృప్యన్మ
యూ, రుదవాగ్నిప్రతిమల్లువిగ్రహానమగ్రున్ ।వానిదోర్వీర్య
నం, పదకున్ బాసటగా నమర్చె సమరప్రారంభసంరంభియై.

ఉ. శుంభనిశుంభులన్ దెగడు శూరులు వీరల నా జెలంగి య
స్తంభపరాక్రమక్రమవిశాలతమై జతగూడి వారు దో
స్తంభవిజృంభితాసిముఖదారుణశస్త్రపరంపరాప్రము [స్.
త్తంభితధీధితుల్ దివికి దార్కొన నుక్కునఁ జేర్చి రెంతయు

శా. లాడూఖానుని నివ్విధిన్ సమరలీలాకేళికిన్ ముఖ్యుఁగా
నీడం జోవక నూలుకొల్పుచు లడాయాకిన్ వడిన్ మొగ్గరం
బై డాయన్ పమకట్టి జోదులఁ దదీయానీకినీశ్రేణినా [ద్ధతిన్.
డాడం జేర్కొని మార్కొనన్ నిలువువాఁడై ఖానుఁ డత్యు

మ. నుతనత్వాధరితోగ్రసేనజనుజానూఖానుమీర్జానుజా
నుతలోత్సారితవరఁవరఁతనమాన్సుఁ మూనకోరవ్య ని

ర్జితనానాహితవర్గదుర్గనిచయుఁ డీ సిద్దిబిలాలానుతో [డై.
జతగా నూల్కొలిపెఁ మహోగ్రరణదీక్షాదక్షిణక్రూర్యుఁ

శా. లీలాభర్త్సితదున్ననేనుహానసల్లీఖాను నాయోధనా
ఖీలప్రక్రమవిక్రమాతిశయవాగ్భితారిదుర్గానులా
లాలోలాయతవక్త్రుఁ డైన షుకురుల్లాఖానుతో జంటగా
నోలి న్నిల్పె నరాతినిగ్రహకరోద్యోగక్రియాధుర్యుఁ డై.

శా. అత్రాసాత్మవరూధినీనికరబాహాహాంక్రియాసారచా
రిత్రధ్వస్తసమస్తశాత్రవనృపశ్రేణీభుజాగర్వునిఁ
క్షత్రగ్రామణి సుగ్రవిగ్రహుని మూసాబూసి దోట్పాటుగాఁ
జిత్రక్రోధరసాగ్నిభుగ్నతనుఁ డై చేర్చెఁ రణేచ్చారతిన్. 24

శా. లాసూదొట్టిఫరాసుకుండలము లోలస్సేనుతో జోడుగా
లాసుఁ లాసుకు ధన్నిధన్నికిని కుష్లామంటికుష్లాముతో
మూసుఁ మూసుకు కుప్పి కుప్పికిని నై మత్తేను సీరీతిగా
మూసాపూర్వ్యలశృంఖలాకృతిని గుంపుల్ దీర్చి తోరంబు
గన్. 25

వ. యివ్విధంబున నానావిధసేనానాయకుల సమకట్టి యం
దగ్రభాగంబున లాడూఖాను కుమందమును బిజాందిదెస
జంద్రాల్మహమ్మదు హుస్సేనుమయూరును వారలకు దక్షిణ
పుదిక్కునఁ గన్నాకుగా జానూఖానుమిర్జాసిద్దిబిలాల్ఖాను
లును దదుత్తరదిశను హాసనల్లీఖాను షుకురుల్లాఖానులును
బశ్చాత్ప్రదేశంబున ఛత్రపతి రామచందురుప్రముఖరజపు
త్రసమేతంబుగా బాంస్లీక ఫారసీక యవన బర్బర
పుళింద మల్కఫుల్కసాదు లగు సాదులును మధ్యప్రదే
శంబున విజయరామరాజన్య తిలకంబును నుద్ధతులము

ల్కును వారల కిరుగెలంకులం బొసఁగ ఁగాలాసూపురోగ
మఘరాసుమండలంబును బాదుకొల్పి నాసీరంబునం జినిసీ
ఫిరంగు దాదులును జెక్కుమొనల నుక్కుగల జిరాగుతా
లఫౌజును దాని కంతటికి జక్రవలయాకారంబులుగాఁ
జెకిముకితుపాకీబారుగడిదీలను దత్తదుచితక్రమక్రమాను
గుణ్యంబుగా నీలపీతారుణగౌరకడారపిశంగవర్ణస్ఫీత కేతన
వ్రాతంబులును భల్లూకవ్యాఘ్ర చర్మభర్మమయవర్మ
విశేషంబులును భండనోద్దండమండనప్రకాండంబులునుం
గీలుకొలిపి దండాకారశకట క్రౌంచపద్మవ్యూహప్రకారం
బులుగా మొగ్గరంబులుదీర్చి గడీదిరుగువా రంఘిరాయిం
పు మని యనీకినీనికరంబుల కనుజ్ఞ యొసంగినం గదలి యు
త్తుంగమత్తమతంగజ బృంహితంబులును సంగరాభంగుర
తురంగమ హేషానిర్ఘోషంబులును శతాంగనేమీవిరావం
బులును నానాయోధనోద్భటభటోత్కరక్ష్వేళారవంబులు
ను శింజినీటంకారంబులును కేతనపటపటాత్కార ఘోరని
స్వనంబులును నరబ్బీబాజార్ఝాంకరణధ్వనులును డమారం
ఫుటోకుల రవలియు నేకీభవించి సర్వపర్వతప్రపంచంబు
నాక్రమించి పఱతెంచు యుగసమయవిఘూర్ణమానచతు
రర్ణవకలకలంబు ననుకరింపుచుం గోలాహలంబుగా విశ్వ
విశ్వంభరానభోంతరాళంబు నిండి దిగంతదంతావళశ్రవణ
కోటరవిపాటనద్రఢిమంబు రవకట్ట బొబ్బిలిగడీచుట్టు ముట్టి
నిలిచె నంత నచ్చట. 26

ఉ. హైదరుజంగుపంపున మహాహవకేళికిఁ గోటచుట్టి బా
హాదృఢవిక్రమోద్ధతి రయమ్మున సైన్యము వచ్చి నిల్చె ని

మ్మాదివిచార మొల్లని యమేయపరాక్రము రంగరాయధా
త్రీదయితుం గుఱించి విచరించిరి యచ్చటిపెద్దమానసుల్.

క. అంతట రంగారాయఁడు
చింత యొకింతయును లేక చెన్నగు ధృతి మ
త్స్వాంతమ్మున బురుజెక్కి త
దంతికగతఖానుసేన నంతయుఁ గాంచెన్. 28

తే. చూచి తలయూఁచి తద్బలస్తోమభీమ
సమరసన్నాహసాహసోత్సాహములకు
నబ్బురం బంది వీరంద ఱస్మదీయ
లోహనాళంపుగుళ్ల వ్రేలుదురుగాక. 29

చ. అని కృతనిశ్చయుం డయి నిజాశ్రితవీరభటప్రతానముం
గని కనుసన్నలో మెలఁగఁగాఁ దగురీతిని నియ్యకొల్పి మీ
రును జతనంబుగాఁ గరసరోరుహకీలితలోహనాళులై, సుని
శితకుంతసంతతులు శోభిల నుండుఁ డటంచుఁ బల్కుచున్.

తే. మనయ రాబాసమిష్టిభీమంబుగాఁగ
మందుగుండును గట్టించి పొందుపఱచుఁ
జెందు నెందుల ననవుఁడు గ్రిందుకొనుచుఁ
దత్తదధికృతపురుషు లందఱును జెలఁగి. 31

సీ. నక్రప్రదీపనిర్వక్రశక్రాభీల
కీల లొల్కెడుఫిరంగీలవారు
కాలకూటంబులు జ్వాలాముఖంబులై
క్రాలెడు జభరుజంగీలగుంపు
కాలకాలాయసాకారఘోరమ్ములై
పొలుపొందు గుంటికోపులబిడారు

ద్ధతుగా రై ప్రకటించుచు న్నిలిచెఁ జెంతన్ పాండవశ్రేణికి
ష్టతము న్నాజికి సైన్యనాథుఁ డగు ధృష్టద్యుమ్ను చందం
బునన్. 38

చ. కరులు రథంబు లశ్వములు కాల్బలముల్ సమరోచితక్రియా
సరణి నలంకృతంబు లయి సత్వరగా నరుదెంచె నంత ని
ష్ఠురభుజసాహసప్రథిమ జొప్పడ జాగ్రతతోడ దానునుం
గురుతరలీలమై పసపుకోకలు దాలిచి నిల్చె నాజికిన్. 39

శా. రంగారాయనృపాలుఁ డిప్పగిది వీరగ్రామణుల్ మెచ్చ స
ర్వాంగాలింగితశాలిబాసిచయహృద్యత్కంచుకభ్రాజియై
వెంగళ్రాయుని కాత్మసోదరున కుర్వీభార మర్పించి సూ
నుం గౌతూహల ముప్పతిల్లఁ దదధీనుం జేసి యూపిమ్మటన్.

క. చెలికాని వెంకభూవరు
నలఘుస్థైర్యంబు మెరయ నవరోధజనం
బుల నాలోకనయాత్రకు
నలువొందఁగ నీయఁ గొల్పు మని దృఢమతియై. 41

చ. అపుడు ధరామరాగ్రణుల కానతుఁడై తిలభూహిరణ్యగో
కపిలపిశంగవస్త్రతుళగప్రకరాదులు చాల నిచ్చి ని
ర్చపలమనస్కతఁ వివిధసారతటిఁ భజియించుచుఁ త్రివి
ష్టపపదవీసమాక్రమణసంభవలగ్నవిచారమగ్నుఁడై. 42

క. ఖానునియడకు జిరాయ
త్ఖానాబాయన్న ననిచె కడువడి రంగ
త్క్ష్మానేతయమరలోక
ధ్యానారూఢాత్ముఁ డిట్లు తగదభి తెలుపన్. 43

చ. అతఁడును నల్లు యేగి యనయ మ్మిది వారలు పిన్నవారితో
మాత మగువారు మీరు తెలియ న్బలుక న్వివరించు కేని
యుద్ధతమతులై దురం బగు విదారణపుం బని పూని
యిట్టిదుష్కృతి విడవేని పై నుసురుమానదు నీకు నిజంబు
ఖానుఁడా. 44

తే. కోట విడిచి పోవ రాటోపములు జూపి
తిరుగబడి దురంబు నెరపనోప
రాత్మఘాతవలన నభిమానరక్షణం
బనుమతించువార లకట వారు. 45

మ. నయ మింతేనియు లేక మీర లటు లన్యాయంబుచే రాఁగని
ర్భయతం దాల్చుచు మేము మానుషపువర్ణం బౌట మీ
కిట్లు నిర్దయ యొప్పు విధి లేదు చావక యధర్మవ్యాప్తి
చేకూరు మీ, పయి జైఁ జేసెడు బుద్ధి లే దిది మనోవా
క్కాయకర్మంబులన్. 46

చ. మరణము డాసినప్పు డసమానపరాక్రమశక్రసూతిభూ
వరతిలకంబు రంగనృపవర్యుఁడు పోరున నోల మాన చే
కురఁ డటమీఁద నెందఱనుఁ గూల్చినా చచ్చెడువాని
కుర్వి సాగర మది జానుదఘ్న మగు గా యని యాయన
యేగె కర్మిష్ఠరన్. 47

తే. అంత నచ్ఛిద్రకర్ణుఁ డుద్యద్దవాగ్ని
పగిది మండుచు నిప్పుడ బవరమునకు
నూలుకొల్పెద నని లేచి మోహిలనుండు
పసిడిజలపోతఖాతి నీష్టైవి దొడిగి. 48

శా. బంగారంపుఫరంజుక్రొంజికిలివాల్పట్టినడాలుఁ జిరా,సింగా
ణిందొనలఁ వహింపుచు సిరాజీఫారసీదేశపుఁ, టాంగణ్ణు
జ్జమ్ము నెక్కి వచ్చెను నిజాంతః క్రోధవాఃపూరముల్, పొం
గఁ హైదరజంగు జంగ మనగంబో నాచమూభూమికిన్.
శా. సేనావారముఁ జొచ్చి వచ్చి యతఁ డక్షీణానురాగంబుతో
నానాసైనికనాయకప్రతతిలో నానీరదేశంబులం
దేనుంగుంగముల న్దురంగమముఁ యేయేనిశానీలతో
జానాజోదుల నెల్ల నారసి నమిజ్జాగ్రి త్త్వరోదగ్రుఁడై. 50
శా. జానూలాడుఫరాసుసిద్దిరజపూర్జండాగ్రిల్మహమ్మాదుమ
ఖ్యానీకిన్యధినాథయోధులసముద్యద్దర్పసందీప్తులఁ
గానిండాలము చాల మేలయిన లగ్నం బంచు రావించె న
న్మానింప న్దర రనేగి వారును రణోన్మాదానుమోదాత్ములై.
శా. డేరీజా కెదుటఁ ఫిరంగులగముల్ ఢీకొల్పి ఘోరాహవో
దారస్వైరవిహారసారకలవాదర్పాంధబంధూ భవ, న్నీరం
ధ్రాద్రిదృతవీరపాణుల్ కృపాణీప్రస్ఫురత్పాణులుఁ,గూ్రిర
ప్రాణులు నైన దాడుల రవుల్కొల్ప న్నియోగించినన్.
మ. జినిసీదీర్చి ఫిరంగుదాదులు సముత్క్షిప్తాంశుకస్తోములై
యనలజ్వాలలు కోలల న్గమిచి హాహారావ ముప్పొంగఁ ద
ద్ఘనవప్రోరుకవాటపాటనకళాగాఢోద్యముల్లత్క్యద్ప [లన్.
ష్టిని యొక్కుమ్మడి నాదుకొల్పిరి దిశాశ్రేణుల్ కదుంబెగ్గి
వ. అపుడు ధరాతలం బదరె నద్రులు మ్రొగ్గతిలెఁ దిశాతల
ద్వీపములు దిర్దిరం దిరిగె దీర్ణము లయ్యె వారిత్పరంపరల్
తపనహిమాంశు లొత్తిలిరి తారలు డుల్లెఁ బయోధు లింకె
ని,ట్లపరిమితంబుగా మొఱయునాజినిశీనినదంబుడంబునన్.

శా. రుద్రాదిత్యమరుద్వసుప్రతతిభీరూభూతభూరివ్యథా
ముద్రాముద్రితచిత్తతంబొరసి గుంపుల్ గూడె మింటన్ జగ
ద్విద్రావద్రఢిమైకభీకరతమావిర్భూతధూమధ్వజో
న్నిద్రోగ్రపద్రవకృచ్ఛతఘ్నిపటలీనీరంధ్రనాదార్భటిన్. 55

తే. కటకటా యిట్టిదు స్తంత్రకార్యమునకుఁ
బూనినయతండు మూఁడవపూఁటయందుఁ
గులిశధారానిహతిఁ గూలు కొండకరణి
గంతుగొనఁగలఁ డని పల్కె గగనవాణి. 56

క. నెత్తురులసోనవాన వి
యత్తలమున నుండి తొరఁగె నవనిస్థలిపై
మొత్తంబు లగుచుఁ గడువడి
నుత్తలపడి రాలె నపుడు నుల్కాతతులున్. 57

సీ. తట్టికోటయగల్చి దారుణోష్మలు గ్రుష్మ
వంకదారుకు డాసి వ్రాలునవియు
నినుపతల్పులు ఘణిల్లనఁ దాకి పిఱిఁదికి
రవలిపై వచ్చి నెట్టవియు నవియు
ద్వారబంధపుఁగమ్మి దూఱి యవ్వలికంట
డుస్సి పాఱఁగ నోడి డొల్లునవియు
గుఱిఁ దప్పి పఱతెంచి కోటముంగలిహస్తి
నఖపుదుమ్ములరేచి నక్కునవియు

తే. నగుచు నొంటెడ నెడయూళ నంటి తూఁగి
బంతు లాడినపగిది గుభాల్లుభాలు
నినదభయదార్భటులశతఘ్నిప్రయుక్త
తాళఫలసన్నిభాయసగోళతతులు. 58

సీ. గంధాశ్మనికరదుర్గంధధూమస్తోమ
సంఛాదితాఖిలాశాచయంబు
బహుళశతఘ్నిగుభాల్గుభారభటికా
బధిరీకృతేంద్రసభాతలంబు
కేతనాతతమరుద్వ్యాప్తిఝంకరణప్ర
కంపితసకలలోకవ్రజంబు
భేరికాధ్వానాదభీతావనీధరా
గ్రస్థలస్థాయి మృగప్రకాండ
తే. మశ్వఖురకోటిఘట్టనాయాసచకిత
ధరణిధరణాత్తమాత్తభూత్కరణభగ్న
మానశేషాహిరాట్ఫణామండలంబు
తొలుఫిరంగులజగడంబుకలన నిలిచె. 59

శా. జెట్టిం జీమలుబట్టినట్లపుడు నిశ్రేణుల్ శిరస్త్రాణముల్
కట్టుం గోలలు పాఱచిప్పలునురంగంపుల్ సుతారుల్ జురా
తొట్టుల్ కుంజరపుంజముల్ మదుపుగత్తుల్ మొత్తమై రాగడీ
జిట్టుల్ జిట్టున లగ్గెక్కుటకునై చేరె న్బలస్తోమముల్. 60

మ. రణఘాటీలును దంధమాలు గడిమోర్చాలుల్ ఫిరంగీలు చి
క్కణమా సూరతుమందుగుండ్లు పోదులుల్ గాఢంబుగా
కోటచుట్టుముమాత్రం బెడయీకయీకవిడినట్లంతంతకుల్
డాసి రా, గణకం గాంచి తదంతరస్థభటసంఘాతంబు
నిర్భీతమై. 61

ఉ. వచ్చెను హద్దు తప్పి బలవర్గ మనర్గళవిక్రమోద్ధతిల్
హెచ్చియగడ్త డాసి యని హెచ్చరికం గడిమన్నెవీరుతో
నొచ్చము మాని తెల్పనపు డుక్కున హూయని సన్నకొల్పి

మీా, యిచ్ఛను వచ్చినట్టు లేక నేయుఁ డనె జ్జనపాలమౌళి
యున్. 62

తే. సంధి పొసఁగమి నిట్టి దుస్సంధి గూడె
నింకఁ బో దని యొండొరు లెచ్చరింపు
కొనుచు బురుజులఁ దగు ఫిరంగులన గాదు
కొలుప సాగిరి వేనవే ల్గుములు గూడి. 63

చ. చొరఁబడి వచ్చువారి గుఱిఁ జూచుచుఁ గొంకక జేరుగళ్ల
లో,నురువడి వంచిపట్టి యెడ యూదక పై నెలగోలురగ్గడీ
యురువడి వెంబడి న్నిలిచి యోర్చుచు నేయఁగ మూఁగి
పెల్లుగాఁ,బరువడి నొక్కపెట్టునఁ దుపాకులు ధామ్ముధమీా
ధమీాలునన్. 64

శా. వాసిం బేర్కొను రంగరాడ్గజనుదవ్యాసంగము ల్మాని యా
మూసాబూసి ముఖాహితాననవాంభోజాతగంధగ్రహే
చ్ఛాసంరంభనిగుంభితారవములై చంచద్గతి న్వచ్చు భృం
గీసంఘంబు లనంగ వ్రాలెను దుపాకీగుండ్లు రిపువ్యూహన్.

సీ. కోటపేరిటిశక్తి గ్రుడ్లెఱ్ఱగావింపఁ
బొరిఁబొరి రాలునిప్పులో యనంగ
రణదుర్గమీాద నీరంధ్రంబుగాఁ జల్ల
రాజిల్లు నాచార లాజ లనఁగ
గడిదుర్గ మనియెడి కాళాహి గ్రక్కిన
క్ష్వేడిమువిసంపుగుళిక లనఁగ
రంగరాయకుమారమణాభ్రమునఁ బుట్టి
దొరఁగెడు పిడుగుకుప్పతునక లనఁగ

తే. లెక్క కెక్కుడుగాఁ దూగు రేకలాలు
గుంటికోపులు జబరుజంగులు ఫిరంగు
లొక్క మొగి గాతు గావింప నుక్కు మెఱసె
గుండ్లగుంపులు జడివాన గురిసినట్లు. 66

క. ఇరువాగుదొరలదళములు
మొఱసె నగారాలు మేరుముఖపర్వతముల్
దురమున కొండొరు దారసి
యురువడి ఢీఢిక్కులాడు నోఱపునఁ దఱుచై. 67

శా. భేరీభాంక్కరణంబులుం గరిఘటాబృందిష్ఠఘీంకారముల్
ఘోరాటోపవిజృంభితారిజనతాకోదండటంకారముల్
వీరవ్రాతభయంకరారభటిమద్విఖ్యాతహుంకారముల్
నీరంధ్రింబులుగాఁగ రెండుదెసలన్ నిండెన్ ప్రచండోద్ధతిన్.

మ. తమప్రాణంబులు వైరికోటులును దత్ప్రాణప్రతానంబులుం
దమకుం గైకొనకుండ మార్పులకు నై దార్కొన్న యా
యోధనో, ద్యమకేలాపసరంబునం దెగర నేయం దోఁచు
పిష్టాతక,క్రమమై వైచె ధరారజంబు హయరింఖాసంఘసం
ఘాతమై. 69

తే. అట్టియద్భుతరసదిదృక్షాతిశయము
చొక్కఁగ విమానతతు లెక్కి నిక్కినిక్కి
చూడసాగె వియచ్చరస్తోమ మప్పు
డభ్రిమున నుండి తముఁ దాఁకు ననెడుభీతి. 70

తే. అంత నేనును గలహాశి యగుటఁ జేసి
కుతుక ముదయించి వచ్చి భారతరణంబు

నాఁడుగాఁ గోటిపేదనై నేఁటి కింద
గంటి నని కుంచవిసరుచు నుంటి మింట. 71

మ. అపు డన్యోన్యజయాభిలాషలరణాహంకారహుంకారపూ
ర్వపరిస్ఫీతనిజప్రతాపకలనావైదగ్ధ్యముల్ మీఱఁ దో
రపుఁ గిన్కన్ రిపుకోటిబిట్టదుర దుర్గస్థాయులుం గోట బా
క్కి పడంగా యవనోగ్రసైన్యముఫిరంగీల్ గుప్పి రొక్కుమ్మడిన్

మ. ఇరువాగుండళముల్ ఫిరంగులగముల్ హేరాళమై పర్వ ని
ట్లురువేగంబున నేయుచుం డ్లగిరి మొండొంటి న్వడిందాకి ని
ష్ఠురనిర్ఘోషముతోడమిన్నొఱయుచున్ క్షోణీస్థలిన్ వ్రాలి క్ర
చ్చఱ పాతాళతలంబు ముట్టనరిగెన్ సంగ్రామరంగంబునన్.

మ. గజముల్ ఘోటకముల్ బడల్పడిచనంగా వారువప్రం బొగిన్
రజమై కుప్పలు గూడి రాలి పడ సంరంభంబుచే వీరులున్
భుజగర్వం బనివార్యమై పొదలఁగాఁ బోరాడి రమ్మన్నె రా
డ్ధ్వజినుల్ మ్లేచ్ఛభటుల్ పరస్పరజయాధ్యాసీనభావంబునన్.

శా. ఈలామండనముల్ జటిల్పడ జజాయీ లేకలాలున్ ఫిరం
గేలున్ రువ్వినగుండ్ల పెన్బొగలు నింగిం గ్రమ్మె నిమ్మై తమో
జాలంబుల్ సమరాంగణంబు మెఱసెం జాలంగ పీనుంగు పెం
పైలూనాకృతిఁగాంచెబొబ్బిలిగడీయాలంబు సోలింపుచున్.

మ. పరుషాంభోధరమండలం బురువడిం బ్రస్ఫీతగర్జానము,త్క
ర్షమై క్రాలు మహాశనిప్రతతి నాఁ గారామసింగీలఘో,రర
వం బాల్కొడు వేడిగుండ్లురల హోరాహోరిగాఁ బోరిరి, ట్లి
రువాగుం దొర లంత భీతికరమై య్యేపారె నాలం బొగిన్.

చ. బలముల నెచ్చరింపుచుఁ దుపాకులమూఁకలు దంధమాలు
వి,ట్లలముగ మోరిజా ల్బురుజు డాయఁ గిలార్చుచు లాడు

ఖానుఁ డు,జ్జ్వలతరకోపవహ్నికణ సంజ్వలితేక్షణుఁ డై
కడంగికో,ట్ల నడపించె సైన్యముల దర్పవిజృంభణ ముప్ప
తిల్లగన్. 77

శా. శాతాసిప్రభ లాకసం బలముగాఁ జండాస్త్రమహామ్నాదసం
జాతక్రోధరసప్రసారితజిగీషాభీషణౌద్ధత్యవా,చాతంత్రంబు
వెలార్చుచుం గడువడిన్ సన్నద్ధుఁడై తూఁగి సం,ఖ్యాతీతం
బగు సేనతో నడచె హుంకారింపుచున్ లగ్గకున్. 78

మ. పృతనామండలికుండలీకృతధనుర్బృందంబుతో సందడిం
చి తుపాకుల్పయినుండిరా ఫలకముల్ శీర్షంబులం జేర్చియా
తతహేతి ప్రకరంబు డుస్సికొని యుద్ఘాటింపుచు న్గోడ కు
ద్ధతిడాబాలును నొడ్డుగుంటలును సండల్గాఁగ డాయంజనెన్.

శా. కేడెంబుం దరవారుఁ గేలఁ గొని యక్షీణప్రతాపాద్భుత
క్ష్వేడారావ మొసంగ దానును దుపాకిం ద్రిప్పుచుం దేవన
మ్రాడావాసపురంబుపైఁ దొడరు వృత్రప్రక్రియం గ్రుద్ధుఁడై
లాడూఖాను కుమందమేడ్తెఱ గడీ లగ్గల్ గొన న్రావడిన్.

చ. బురుజులమీఁద నుండి పరిఫుల్లసరోరుహగర్భనిర్గళ
ద్గురుతరచంచరీకములకోవునఁ బెద్దతుపాకిగుండ్లు ని
ష్ఠురగతిచిత్తవాన తెరపోకిన చాడ్పున జాలగోత్రులన్
విరిగిరి బెగ్గడిల్లి పురి విచ్చిరి నొచ్చిరి మ్లేచ్ఛు లయ్యెడన్.

చ. మునుమునఁ దారసిల్లి తన మొగ్గరవుం బలుమానును ల్గడున్
వెనుకకు నోల మ్మాప గొని వీఁగినఁ గ్రమ్మఱఁ గూడఁగట్టి యీ
ఘనతరదుర్గసాధననికామపటుత్వముఁ జూపుఁ డంచు నె
ట్టనఁ బురిఁ గొల్పి యిట్లలవడన్ నడపించెను లాడుగోడకున్.

మ. మనలా డూచెరలాడు సైన్యములతో మాద్యద్గతిం గోడ గ్గె
కొనఁ దా లగ్గకుఁ దూగె నంచు విని యత్తుభ్రాత్మ వర్గంబు నె
క్కొ నఁగా రాజవతంమఁ డుద్ధతులమల్కుం గారునిస్సాణని
స్వనవిస్ఫోటితదిక్ప్రఘాణు లగుచుం నన్నద్ధులై తోడ్పడన్.

మ. తనకుం బానట గాఁగ నిల్చిన భుజాదర్పాధికప్రాణులం
ఘనులం వారలఁ గాంచి కయ్యమునకుం గాల్ద్రివ్వుచుం
బిచ్చలిం,చిన తోడ్పాటున కుబ్బి బొబ్బిలిగడీఁ జేకొందు నే
నిప్పు డం,చును లాడూతనదోఃప్రసంగగరిమల్ శూరుల్
వితర్కింపఁగన్.	84

చ. గజఘరజంగుపెంపున నికామతరత్వరఁ గొల్చుచుం జమూ
వ్రజముల నూలు క్రొల్పి పురి వాయక యుండ మఱల్చి
కొంచు భూ,రజము మఱుంగుగా నుఱక రౌతులబాసటఁ
దూఁగి డాసె లా,డజనము నెత్తి న త్తమిల న త్తమికండ ఱుఁ
దన్నుఁ జూడఁగన్.	85

శా. మూసాబూసియురాజు నాశ్వికబలంబుల్ ఫారసీకాగ్రణుల్
లాసూదొట్టిఫరాసుమండలము కిల్లా బెగ్గటిల్లంగ ధా
రాసంపాతము గాఁగ నొక్క మొగి గర్ణాలుం దుపాకీలు సం
త్రాసం బానఁగ గుప్పి రెల్లెడల నీరంధ్రంబుగా న త్తఱిన్.

వ. ఇట్లురువడింపుచు లాడూఖానుండునుం దనయిరుగెలం
కుల నుఱక మొఱయు ఢక్కాహుడుక్కాపటహాత్మటభే
రీభాంకారంబుఁ గరిఘీటాఘీంకారంబులుఁ బ్రమత్తరా
హుత్తప్రకాండ కుండలితకోదండ మార్వీఠంకారంబులుఁ
బదాతిజనహుంకారంబులు బిట్టుఱికి జెట్టిమగలలో నొం
డొరులం బిలిచికొను నెలుంగుల కలకలంబులుఁ దుములం

బులుగా బురుజులపై నుండి వ్రాలు లోహనాళప్రయుక్త
భయదాయకాయోమయఘుటికాపరంపరల తుంపరలకుఁ
జెదరక తురంగమఖురాహతధరాపరాగపటలంబు రోదసీ
కుహరంబు నిండ మెండుకొని నిశ్శ్రేణికానికాయాదిసాధ
నంబులతోఁ గిలార్పుచుం గదియబఱతెంచు నవసరంబున.

మ. పటహధ్వానవిఘూర్ణితాఖిలదిశాబ్రహ్మాండభాండంబుగాఁ
బటుసంరంభముతోడ బొబ్బిలిగడీపై నుండు జోదుల్ నిజో
ద్భటదోఃపాండితిఁ జూచి మింట సురబృందంబుల్ వెరం
గంద నో, క్కట మ్రోయించిరి రామసింగులు ఫిరంగీల్
గుంటికోపు ల్వడిన్. 88

సీ. తొలుదొల్త బాడబజ్వలనకణాల్లోల
ఖేలనల్ గల తుపాకీ లమర్చి
యావెన్క నుద్వేలదావపావకశిఖా
భీలంబు లగు జజాయీలు దీర్చి
యాపిఱుందయు గాంతయమదంష్ట్రికాచయో
త్తాలంబు లగు రేకలాలు నిలిపి
యాపిమ్మట నటద్విరూపాక్షఫాలాగ్ని
కీలలీనెడు ఫిరంగీలు నించి

తే. జబరుజంగులు బెనచి బిట్టుబుకనేయ
బదరికామలకామ్రజాంబవకపిత్థ
తాలకూష్మాండసన్నిభోత్తాళగోళ
జాల మయ మయ్యె యావనసైన్య మపుడు. 89

సీ. కత్తళమ్ములు చించి బత్తళమ్ములు ద్రుంచి
వెడఁదరొమ్ములు దుస్సి వెడలిపాఱి

కండలు తెఱలించి గుండెలు గమలించి
కండనగాయలు గాడిపాఱి
తలలు ముక్కలుజేసి దౌడ లుక్కఱ డాసి
మెదడు బైలురుకంగఁ బొదువఁ బాఱి
వీనులు వదలించి జానులు విదళించి
తిత్తులు దిగదీయ హత్తిపాఱి
తే. పిక్క యంకిలి చంకిలి ప్రక్క డొక్క
మూపు నీపనఁ గాళ్గేలు ముక్కుఁ జెక్కు
కన్ను వెన్ననకుండఁ జీకాకుపఱచె
సుడుసుడులు గట్టి యగ్గుండ్లసోనవాన. 90

మ. కరియూథమ్ములు మ్రొగ్గి బెగ్గలెఁ దురంగశ్రేణిపై వ్రాలెఁ ద
త్తురగస్తోమము కాల్బలంబులపయిం దూలాడుచుం గూలెఁ ద
ద,త్త్వరపాదాతిచయంబు బాఱుగ గఁతండంబుపై సోలెఁ
జెం,దిరపుం గొండలువోలె నెత్తు రొలుకన్ ధిక్కారముల్
మానుచున్. 91

వ. అది మఱియునుం గాక కాకోలకబళనారంభసమయ సంరంభ విజృంభిత శాంభవ ఫాలఫలకవిలోకస జ్వాలన కరాళాయమానకీలాకలాపంబులం బోనిశతఘ్నికాపరంపరలు నఱపినం దెఱపి యీక మంటలు గ్రక్కుచుం గ్రిక్కిఱిసి చుఱుకుచుఱుక్కునం గాడిపాఱం బోఁడిమి చెడి పుడమిం గూలు మాతంగంబులును తుతంగజవ్రజంబుల తిరుగుడులం గుదివడివడి దప్పి దప్పిగొని కుప్పలుగా నొఱగు తురంగంబులును దురంగమనిపాతవేగంబునం గొందలం బంది క్రిందం బడి నలిగి బొందులు వదలు రాహుత్తులును రాతులనం

వడిం బడి కాలు చే యాడక వ్రాలు కాలుబలంబులును బాదాతిజాలంబులు పలువలుకం బాటినజజాయిగుండ్ల తాఁకునం దేకువ పడలి వడి దరగి తొఱఁగు గడిదీసమూహంబులును రేకలా రాకరకు మైమఱువులు రువుళ్లుగా డుస్సి పాఱినం గాయంబుల వెంబడిం బాఱు నెత్తురు టేరులం దేలియాడు యవనపుల్కసాదికళేబరంబులును దుపాకీ ధమాధమీకారంబులకు నాకులం బంది డిందం బాఱి కొఱఅప్రాణంబులతో విలవిలం గుదులుకొను రాజన్యమండలంబులును దండధరపురోన్ముఖులై యాత్మవర్గంబులం దలఁచి నెవ్వగలం బొగలు రజపుత్రవ్యూహంబులును పరాసు లగు ఫరాసులును గాందిశీకు లగు ఫారసీకులును శరణాగతవింధ్యపక్కణు లగు ధక్కణులును బలాయనాయత్తు లగు దలాయత్తులును నొగిలిన వీరభటులును సాధ్వసస్వాంతు లగు సార్జంతులును నిగూఢప్రచారు లగు మయూరులును నధిగతార్తప్రణాదు లగు సోలుదాదులును విహ్వలితాకారు లగు సుబేదారులును దెగిన కుత్తికలును జిమ్మనగ్రోవులం జిమ్మిన వడువున న్వెడలు రక్తధారాపూరంబులును వండం దఱిగినట్లుండు కండలకొండలును బ్రేవుల ప్రోవులును బిండిలిపిండు లైన గుండియలును ఖండంబు లైన కాలఖండంబులును రజంబు లైన భుజంబులును జెక్కుచెక్కైనడొక్కలును బరెవరె లైన పుఱియలును దుత్తునియ లైన మేనులును బగిలిన యురంబులును దుమ్ము లైన యెమ్ములును లుంఠితంబు లైన కంఠంబులును దుండంబు లగు కోదండంబులును నినుము లైన యసి

ముసలంబులును సంజాతవినిపాతంబులగు కేతనంబులునుం గలిగి రౌద్రరసాతిరేకంబునకు సూచకంబై లులితకేశజాలంబు శైవాలంబుగా గళితమణిభూషణమణివిసరం బిసుముగాఁ దేలి యాడు చిందంపుపరువు నురువుగా నడుగునఁ జేరిన మెదడు కర్దమంబుగా నంతరాంతరంబులం గనుపట్టు ప్రపదంబులు కూర్మంబులుగా ముక్తాహారవారంబులు జలవ్యాళంబులుగాఁ గరవాలచక్రంబులు నక్రంబులుగా నవిరళంబుగాఁ బ్రవహించుశోణితతరంగిణీగణంబులవలనం దలంపను విలోకింపను దరంబు గాక భీభత్సాత్మకంబై కుత్తుకబంటిగా నెత్తురులు గ్రోలి మొత్తంబులై నృత్తంబులు సలుపుచుం బాతరలాడు భేతాళంబులును గ్రొవ్వుముద్ద లుద్దవిడి దద్దయు దనివిదీఱ నారగించి గుఱ్ఱునం ద్రేచుపిశాచంబులును గండలు మెసఁగి కోటికలు గోఱికి కందనగాయలం గలిగిన చవులు వరికించి గుండియలు దిని పిండుఁగట్టి తాండవం బొనరించు భూతంబులును పీనుంగులై పడియున్న నేనుంగుల ఫాలంబులు గద్దియలుగాఁ గులంబు పెద్దల నాసీనులం జేసి కపాలపాత్రంబుల నతిహితంబు లగు లోహితజలంబులు దెచ్చి యర్ఘ్యపాద్యంబులం దేల్చి ఖేటకంబులు పళ్లెరంబులుపఱచి మేదోమాంసమస్తిష్కమజ్జాదిపదార్థంబులువడ్డించిచుట్టంబులకు విందులువెట్టుఢాకినీలోకంబులును కుణపప్రతానంబుల పయింబడి యాంత్రంబు లురలం దిగిచి మెసఁగు సృగాలకంకగృధ్రంబులుం గలిగి భయానకంబునకు దావకం బై

సురవలోకనీయం బగుతత్సంగరం బభంగురభంగిం గను
పట్టె నయ్యవసరంబున. 92

శా. చెల్లాకుం జెదరైన సైన్యసమితిం జేఁ జాఁచి రావించి యా
కిల్లా లగ్గల కెక్కు టొక్కగణనా కేడించి పోరా దటం
చల్లాడూ మొదలైన జట్టిమగలయ్యాజిన్ విజృంభించుచున్
ఫల్లంబుల్ గొని గోడపైఁ దొడరి దోఃపాండిత్యముల్ జూ
పుచున్. 93

చ. బురుజుల నిచ్చెనల్ బెనఁచి భోరున గైతలు లంప తాలుభీ
కరగరిమన్ గిలార్చుచును గత్తులుఁ గేడెములుం గరంబులన్
శిరమునఁ జూచి పట్టి తనచేతికరామిడి మించునట్లుగాఁ
గరమరుదొప్పఁ జిల్లపరిగా నడిపించెను లాడు గోడకున్. 94

ఉ. తగ్గఫరాసుమండల ముదగ్రతమై బిరుదుల్ వచింపుచున్
లగ్గల కెక్కి రాబురుజులన్ దగు మన్నెకుమారసైన్యముల్
వెగ్గల మైన కోపమున వెన్కొనుచున్ సురుమాడు వీఁకచే
నగ్గలికన్ దుపాకులఁగిలార్చుచు నేయుచు రోయుచు న్వడిన్.

సీ. పొంగులు రాఁ గాగి పొరలు నూనియ ముంచి
గరిగెల వంచి యుక్కరగఁ జల్లు
జిగురుటంబలి వేడి దిగుపాఱజాఱగాఁ
గుండలకొలఁదిగాఁ గ్రుమ్మరించి
వసియార్పు దారుయంత్రసముత్కటంబులు
మేను లుచ్చి చనంగ మీటివైచి
యొండొంటిఁ దోడుగా గుండియ లౌదలల్
గుఱి చేసి త్రెంచె నాగుఱ్ఱు దొలిపి

తే. బిరుసులఁ ద్రెళ్చి క్రొంబోగల్ గురియ నినుప
గొట్టములు రాల్చి మొద్దిగుముల గ్రుచ్చి
చిచ్చుబుడ్ల నగల్చి నిస్త్రింశతతులఁ
బొడిచి పడఁద్రోచి రాసేన కడిమిదోరఁగ. 96

ఉ. బాకుల మొద్దుటీటెయల బల్లెములం జుఱకత్తులం గటా
రీకయి జారులం బొడిచి క్రేళ్లురుకం బడఁద్రోచి రేఁచి ఖ
ల్లాకరుదెంచు నయ్యవనులం దృటిమాత్రములోన నంత న
మ్మూఁకలలోనలాడు తనముఖ్యతకొంచెము వచ్చెనంచొగిన్.

ఉ. కేడెము నెత్తి నుంచుకొని కేవలరౌద్రరసంబు పొంగి రాఁ
జోడ యితం డనంగ నధిరోహిణివెంబడిఁ బెళ్కురాతులం
దోమగ నెక్కి రాఁద్రోణఁగెదు ర్ధదరోషవిఘూర్ణమానుఁడై
లాడుతుపాకిదెబ్బలఁ గలంకక కైదువఁ గేలఁ ద్రిప్పుచున్.

మ. తనదర్పం బిరువాగువారుగన నౌద్ధత్యంబునం బేర్చి ని
చ్చెన వెంటన్ బురుజెక్కి నప్పు డదె వచ్చెన్ వ్రేయుఁ డం
చొక్కగుం,డున వ్రేయం దలవ్రక్కలై చెదర లాడూఖా
నుఁ డల్లాన బీ,యనుచుం బిల్లమిరంబు వైచెను గతాహం
కారుఁడై యుర్వికిన్. 99

సీ. దంభోళిధారావిదారితంబై డస్సి
యవనిపైఁ గూలు కులాద్రిపగిది
హర్యక్షఖరనఖరాంకురచ్ఛిన్నమై
తొరఁగెడు మత్తకుంజరముకరణి
వైయాఘ్రనిశితదంష్ట్రాయాసితంబయి
పొడ వణంగెడు నాలపోఁతుభంగి

శాతపరశ్వధాఘాతనిర్దళితమై
కడువడి నొరగు వృక్షంబుమాడ్కి
తే. బురుజుపై నుండి వ్రాలు నిష్ఠురతరంపు
దెంచె నాగుంటికొఁకు నుదీర్ణమైన
నెత్తిచేఁ దూలి యిలఁ బడి నెత్తు రొలుక
లాడుఖానాఖ్యుఁ డూడఁ గలంగిరంత. 100

శా. హాహాక్రందననిస్వనాకులము భీత్యావేశసంత్యక్తచే
తోహంకారము విస్మృతప్రహరణస్తోమం బుదారస్ఫురా
రాహుత్తాశ్వచయంబు విహ్వలితవీరవ్రాతము త్సారితో
త్సాహాందోళితరాజకంబు నగుచుం దత్సైన్య మార్తిం
గనెన్. 101

చ. పిడుగులు రాలినట్టు లతిభీషణవేగసముద్గమంబులై
పడియెడు లోహనాళముఖభాంకృతి మద్ఘుటికాపరంపరల్
కడువడి మేను లుచ్చి చనఁగా వెర గాసిలి నిల్వరించుచొ
ప్పడరమి వీఁగి పాఱె యవనాధిపసైన్యము దైన్యమందుచున్.

చ. విశకలితాశ్వికావలియు విహ్వలితోరు చమూసమూహ
ముఁ,భృశపరిధావదూనకరిబృందమునై వెలి వేది యిట్లు
క,ర్కశుఁ డగు లాడుపాటుఁ గని గాఢవిషాదమనస్కతం
జతు,ర్దిశలకుఁ బాఱు సైన్యసమితిం గని ధైర్యదశావశా
త్ములై. 103

చ. కనుకనిఁ బాఱు సైనికులఁ గ్రచ్చఱ హైదరుజంగు సాం
త్వన,ధ్వనులు నిగుడ్చుచుఁ బహువిధమ్ముల రమ్మని క్రమ్మ
రించి త,ద్ఘనరథినీపరంపరకుఁ గావులుగాఁ బురికొల్పి

కొందఱన్, మొనల నమర్చి లానుముఖమూర్ఖఫరాసుల
శౌర్యరాసులన్. 104

మ. నిబిడక్రోధరసంబు జొబ్బటిల ధన్నీలానుకుప్పీముఖుల్
శిబికావల్గితకాయులై నిజభుజాసివ్రాతరోచిచ్ఛటా
శబరీభూతదిశాదశాంతు లగుచున్ శౌర్యంబు దీపింప కో
టబురుంజుల్ గదియంగ డాసిరి గరిష్ఠంబైన వేగంబునన్.

తే. ఇత్తెఱంగునఁ బురికొల్పి హెచ్చరింపఁ
గొత్తడములకు లగ్గ కెక్కుటకు నేగి
యాత్మవర్గంబుఁ దోడ్తోడ నరుగుదేర
మార్కొన గడంగెను ఫరాసుమండలంబు. 106

తే. ఇత్తెఱంగున గదియంగ నేగుదెంచి
తన్మహావప్రదుస్సాధ్యదార్ఢ్య మరసి
మొఱకులయ్యును నొచ్చెడివెఱవుదొట్టి
గరిమ దమలోన నొండొరుఁ గాంచికొనుచు. 107

ఉ. ఎక్కుడికయ్యపుం దమికి నేత్తెర మార్కొనుటబ్బుపౌరుషం
బక్కట యెట్టులైన వెడయాసల గెల్తు మటంచు నిగ్గడీ
కెక్కఁ దలంచి కొండపయి కెక్కుపిపీలిక లట్లు ప్రాకుచో
నుక్కరవ్రేలుగుండ్లజడి నొక్కట రూపరకుండ కెట్లకో.

మ. అనుచుం గొందలమందు డెందములతో నాందోళనోద్వృ
త్తి గైకొనుచుం గోటల నప్పరాసులు ననేకుల్ ఖిన్నతం
జెంది ఖానుని నిందించి రితండెపో మనల నున్మూలంబుగా
నొంప వచ్చిన దుశ్శీలుఁడు కారణంబ యని తచ్చేష్టావిధు
ల్ దల్పుచున్. 109

చ. రణధరణీతలంబుల ఫరాసు లజేయు లటంచు నెంతయుం
బ్రణుతి వహించి యుత్తతి నపాకృతవిక్రము లన్న దుర్యశో
వ్రణము భరింప నోపమని వారలు గోడకు లగ్గ కెక్కు కా
రణమునఁ గాలు ప్రోలి కెదురం గమకించిరి చంచలాత్ములై.

ఉ. అప్పుడు పూసపాటికులజాగ్రణి రాజు ఫరాసువారి కిం
పొప్పఁగఁ దోడు వచ్చి సమరోచితకృత్యములైన యుద్ధతుల్
ముప్పిరిగాఁ గిలార్చి బలముల్ బురికొల్పి తుపాకి నాదుచే
నుప్పరవీథి బిట్టదుర నోహరిసాహరిగాఁ బెనంగఁగన్. 111

సీ. పొగబాణములగముల్ నిగుడింప గ్రమ్మెడు
ధూమంబు పెనుమొగుల్ దొంగలింప
నొరనెడలించిన తరవారుమిసమిస
ల్దొలుకాఱుమెఱుపుల చెలువుఁజూప
రామసింగులభీకరము లైన మ్రోఁతలు
యురువడియురుముల తెఱఁగునింప
బారుతుపాకుల మేరమీఱినగుండ్లు
వడగండ్లపాటున వడువు దెలుప

తే. వీను లానంగఁ దిగిచిన విండ్లపెంపు
లింద్రధనురాకృతిస్ఫూర్తి నీసడింప
వాడివాలంపుఁదుంపరవానగురిసె
రామరాజన్యసైన్యధారాధరంబు. 112

ఉ. దానికి వన్నెవెట్టినవిధమ్మున దర్పమెలర్పఁగా శత్రుఘ్నని
చయంబు రంజకము నించుట యేయుట కన్న ప్రాల్చినం
తైన యెడంబుఁ జూపక రయమ్మడిగి రీతిపులాములానుమ
త్రేనుముఖుల్ ధరాసులదరించిరియార్చి గుభాల్గుభాలునన్.

ఉ. చూపఱ కిట్టిబెట్టిదముఁ జూపు ఫిరంగులతాఁకులన్ గడీ
రూపఱకుండునే యని నిరూఢముగా మదిఁ దోఁచనయ్యె న
ట్లాపటువేగదర్పితమహాధ్వనికి న్వెఱఁ గంది నిండి తా
రాపథమధ్యసీమ నమరప్రకరంబు కరంబు మొత్తమై. 114

ఉ. ఒండొరు లెచ్చరించుకొని యుక్కున గోడకు డాయ నేగి రు
ద్దండతమై ఫరాసులును ధాత్రిపసైన్యము లొక్కపెట్టునన్
గొండకు నెత్తెఱన్ గదియు గొఱ్ఱెపొటేళ్ల తెఱంగున న్వియ
స్మండలిఁ బీట లెత్తు గరిమన్ మొరయించు రణానకార్భటిన్.

చ. బురుజులవెంట నిచ్చెనలు పూనిచి చీమలు వ్రాకినట్టు లు
ద్ధురగతి నెక్కి రమ్మగలు దుర్వహగర్వహృతిప్రచండని
ష్ఠురతరలోహనాళముఖశుంభదురుస్వననిస్సరన్మహా
స్త్రరఘుటికానికాయపరితఃపతనంబున కళ్కుపూనకన్. 116

ఉ. అంతట రంగరాయవసుధాపతిచంద్రుని వీరయోధుల
భ్రాంతసమున్నతిం జెలఁగునట్టిబురుంజులమీఁద నుండి ది
గ్దంతిచయశ్రవఃపుటవిదారణకారణదారుణాయసా
త్యంతవిశాలనాళగళితామితగోళము లార్చి రుప్పినన్. 117

సీ. వడివాట్ల కెక్కి వెన్నడితాఁకు రేకలా
        లగ్గలం బైనచో డిగ్గ నుఱికి
బెదరక పైనెక్కి బిడిదంపు టడిదంపు
        పోటుల బెగడొంది పుడమిఁ గూలి
సాబాలు మిడిమించి సాగిరానురవడి
        క్రొవ్వాడి కైదువుల్ గ్రుచ్చదుల్లి
కోటకొమ్మలు డాయఁ గుఱుచయీటెలనాటి
        పడఁద్రోయఁ జదికిలపాటుఁ గాంచి

తే. రక్తధారపరంపరాసిక్తమైన
ధరణివరుణితకాయులై పరిణమించి
పొరలుచుండియుఁ గ్రమ్మఱ నురువడించి
లగ్గలకు దూఁగిరి ఫరాసు లగ్గలికల. 118
శా. వేలారుల్ పటుశౌర్యవిస్ఫురణచే వీఁకన్ గడీ కెక్కి రాఁ
గేలిం బెట్టుచు రేకలాజబరుజంగీరామసిం గీఫిరం
గీలాకుక్కుమ్మడిఁ గ్రందుకో నురవడిం గిల్లాపయి న్బొల్చువా
రాలంపుం గినుకం గిలార్చి ఘనలత్యుస్ఫూర్తి బైల్వెళ్లినన్.
శా. అంగాంగంబుల వ్రయ్య నుక్కరిపులిందానీకినీశ్రేణిత
ద్రంగల్లోహవిశాలనాళనిగళద్రాఘిష్ఠగోళావళిన్
భంగంబందుచు వ్రాలెనయ్యహిమరుగ్భానూష్మలంగ్రాఁగిఖ
ట్వాంగశ్రేణుల రాలు మత్కుణగణవ్యాపార మేపారఁగన్.
మ. డిగి లీలాసుముఖు ల్ఫరాసుదొర లుడ్డీనాభియానోత్పత
త్ఖగవేగంబున గోడపై కెగరి రాకల్పాంతవేళానట
న్మృగభృచ్ఛేఖరశూలసన్నిభములౌ నిస్త్రింశముల్డుస్సి యా
పగఱం దాఁకి ఘుసుక్కునం బొడిచి చంపం గూలి రుర్వీస్థ
లిన్. 121
చ. ఉరువడి నోహటించి నిజయోధవరు ల్వరవాహినీసము
త్కరముల నీటెనూటులను గైదువపోటుల గుండ్ల రేటులం
బరిపరులై పడం జదుపుపాటవముల్గనుఁగొంచు రంగభూ
వరతిలకంబు మెచ్చెఁ బెఱవారలధైర్యవిజృంభణోద్ధతుల్.
చ. అరిమురిరావువంశమణి యక్కజమంద ఫరాసువారిఁ గొం
దఱ బురుజెక్కు పాలకి పడస్థల దన్నియు దొమ్మిపేరు నా
బరఁగిన జోదుల న్మెఱుఁగుపారినకత్తుల నోది వంపఁగాఁ

గఱకుకఱుక్కున న్నరికి గండలు జేసిరి పద్మనాయకుల్

చ. ఎడయిడ కయ్యుసిళ్లు తెర యెత్తినచాడ్పున నగ్గి చాయకు
న్నిడుతలు వోలిమెక్కి మిడిమించుచు మాయిళిఫాయిగుం
పు నల్గడలఁ గిలార్చి నాదు దుముకత్తుల సాగుల చిప్పటీబ
లం,బాడిచి పడంగఁ ద్రోచిరి రిపుప్రతతు ల్వారఁ గంది చూ
డఁగన్. 124

శా. శ్రీరామాస్త్రనికృత్తరావణశిరశ్శ్రేణీక్రియ న్రావురం
గారాయప్రభువీరయోధవరదోఃఖడ్గప్రహారంబులన్
ఘోరాకారతురుష్కసైనికులు చెక్కుంజెక్కు లౌవారు వ
ల్గాఱున్ మార్గానువారు నై యరిది గ్రమ్మం బోరి రాగుబ్బఁ
గన్. 125

వ. మఱియు నిత్తెఱంగునం బవరంబున కెదిరి యదరుగుండె
యుం బిక్క చెదురు లేక యగ్గడీఁపై గగ్గోలుపడ నడిచి
పొడిచి వైచినం గెడలుకొనుచు బిలుకుమార్పుం దక్కిన
జోదు లెదు రెక్కుచుం దనివిసనక యోల మాసగొనినవీకం
బెనంగువారును నైనయప్పద్మనాయకానీకినీప్రకరంబు లడి
దంబులం గ్రుచ్చియు గదాఘాతంబులఁ దెరలించియుఁ
గటారంబులఁ గ్రుమ్మియుఁ జిప్పయీటెలం జిమ్మియు లగ్గదిం
పులం బొంపిరివోవునట్లు వైవం జేవ సడలి యడలుచుం
బురివిచ్చువిస్రస్తశిరస్త్రాణంబులును విధ్వస్తకంకటంబులును
విశీర్ణతనుత్రాణంబులును విగళితకరవాలంబులును విదారి
తకోదండంబులును విభ్రష్టఖేటకంబులును విలుంఠితకంఠ
నాళంబులును విఖండితభుజాదండంబులును విచ్ఛిన్నఫాల
ఫలకంబులును విసున్నకర్ణపుటంబులును వినిపాతితకేతనం

బులును విశకలితమతంగజంబులును విపాటితఘోటకంబు
లును విభీతపాదాతంబులును విస్ఫుటితపటవాజాలంబులు
నుం గలిగి యత్తోలిగల నంబరాసులు గతాసులై పడినం
దిక్కరి గభీరనీరకాసారంబు గండ్లువడిన వడువునం బటా
పంచలై చాంచల్యంబు నొంది పుళిందులఫౌజు భగా
యించి చనుటయు. 126

మ. కృశమై మేనులు దుస్సి పాఱెడు ఫిరంగీగుండ్లచే డస్సి ఫౌ
జుశిక స్తయ్యె ఫరాసులెల్లను బరాసుత్వంబునం బొంది ర
క్తశతాంగేభభటాలి వార్తిలె ననుచుం జారుల్నివేదింప ఖా
నుశహా యుక్కరిఁ జెందె లేఁతమొగము న్మార్ఘ్యాసము
చ్ఛాఘ్రియమున్. 127

ఉ. మానసుయోధనుం డయిన మన్నెకుమారుని వీరయోధు లు
చ్ఛానశతఘ్నికల్బరపుబోడిమిరీతి పులాములాసుల
స్సేనులసీనులై కలన జెండజవందజలైనవార్త యా
ఖానునిమానసంబునకు గాఢవిషాదము నించె నయ్యెడన్.

మ. షుకురుల్లాహసనల్లిఖాన్సుఖతురుష్కుల్ఖానునిం డాసి మ
న్నెకుమారాగ్రణికోట చేకురమికి న్నివ్వింత చింతింప నే
టికి లాడూప్రభృతుల్యమావసథవాటిం జేరుమాత్రానఁ దా
వకశౌర్యం బరివోయెనే యకట యీవంత ల్మతి న్మానుమీ.

చ. అరిజయశౌర్యధుర్యమహిమాతిశయాన్వితు లయినవారి మ
ష్కరయుము నీరిపుప్రతతి యంతయు నుచ్చి చనంగఁ గోట
చే,కురు పనిఁ బూని దూగెదము కోలు మసంగెద మోట
లేక మా,బిరుదుమగింటముల్కలను పెంపు గ్రహింపు మ
టంచుఁ దెల్పినన్. 130

క. తెప్పిరి లేచి బిరాలున
ముప్పిరిగొను కినుక విత్తు మోసులు చూపన్
దెప్పరపుదిటముఁ దాల్చుచు
కప్పిరశివసత్రిపోల్కె ఖానుం డంతన్. 131
వ. తత్కాలంబున. 132
సీ. బిరుదువక్కాణించి భిన్నని వేనవే
త్రేజీలు గొలువ సిద్ధిబిలాలు
సూరెల సమకట్టి బారుతుపాకుల
తండము ల్నడువ నుద్ధతులముల్క
పాలకీ యిరువంక బలసి యీటెలవారు
పరపంజికొన ఫ్రాసపాటిరాజు
డాసిరాహుత్తులు డాల్తరవారులు
దుస్సిరాపీఠిని హస్సనల్లి
తే. ఛత్రపతిరామచందురుజానుఖాను
లాదిగాఁ గల్గుజోదు లంతంత నర్థిగ
నరుఁ గవియవచ్చు కురుబలోన్నతి వహించి
తురకదళకోటి లగ్గల కురువణించె. 133
తే. జలజబంధుండు దాఁ గర్మసాక్షి యయ్యు
దారుణము పుట్టఁగలదని తపనుఁ డగుచుఁ
జూడ నోపక తొలఁగె నాశోభ దొఱఁగి
చరమగిరిగహ్వరముఁ జేర నరిగె నపుడు. 134
తే. అరసి చూడ రజోరుణావరణదీని
నంటఁ గాఁ గూడ దనక లోలాత్ముఁ డగుచు
బగలు వద్మినిఁ గూడిన పాతకంబు

దివసమణి క ప్రకాశతఁ దేకయున్నె 135

చ. రణహతవీరయోధతను ర క్తతరంగిణులం బరాంతరాం,గణ
ములు ముంచి పాఱెనన గాఢరుచిం బొలు పొందె యాత్మ
జ్యం,భణము వెలార్చుచుం గడుజపాకుసుమప్రతిమానశోణి
తా,గణితనవీనకాంతికలికాకలితమ్ములు సాంధ్యరాగముల్.

సీ. అరుణకంఖాణరింఖాఘాతమై మించు
న స్తగిరికరజోవ్యాప్తి యనఁగ
సమయవసంతము తమిరాలియవ్వని
సొబఁ గొందు చివురాకుజొంప మనఁగ
నినని వేశంబున కిడు ప్రతీచీశైల
ర క్తరాంకవకుటీరం బనంగ
రవిహారిత్వముఁ దాల్ప రహిఁ గొల్వ నేతెంచు
గరుడుని ఱెక్కల కళ యనంగ

తే. నపుడు మూర్తిత్రయీమయుఁ డైనలోక
బాంధవునిరాక కెదు రేగు పశ్చిమాచ
లాశ్రమర్షిషాయవస్త్రాంశు వనఁగ
సంజకెంజాయ తారకాసరణిఁ బొదలె. 137

చ. కొలకొలఁ గూయుచుం గుములు గూడి కులాయగృహాం
గణంబులన్, మెలఁగె విహంగమావళులు మిత్రశిలాతతియుం
గవోష్ణమై, చెలఁగె మరీచికాప్రభలు జీర్ణములై నిబిడాభివృ
ద్ధులుం, దొలఁగె మలీమసస్థితులతోఁ దులదూఁగె దిగంత
రంబులున్. 138

చ. దినమను పెండటాక మతితీవ్రగతిం దెగి కాలసిర మె
ల్లను జనఁగాఁ దదంతరవిలక్షితశోకనదంబు తూల వా)

లినగతివారిలొ హేళి కడలిం దదుదారసరోరుహోన్నమ
ద్ఘనతరభృంగసంఘములకై వడిఁ బెల్లగసెఁ దమచ్ఛటల్

సీ. గగనతమాలవృక్షము తమోంబుదలీలఁ
బొలుపొంది పూచినపువ్వు లనఁగఁ
గటికచీఁకటిపేరికాళిందిలోపల
మొనలెత్తు వెలిదమ్మిమొగ్గ లనఁగ
స్వర్లోకమానులు సాంధ్యార్చనకు సేయు
గంగౌఘసైకతలింగము లన
భయదశతఘ్నికార్భటులకుఁ జదలేటి
నదటు నేచినయంచకొదమ లనఁగ

తే. ఘోరసమరస్థలీహతవీరవార
పరిణయావసరాప్సరోభామినీప్ర
కల్పితవితానకలితముక్తాగుళుచ్ఛ
బంక్తులనఁ దారకాతతుల్వెలసె మింట. 140

మ. తమిసాయాహ్నవిరోధిహేళిపయి సంధ్యారాగరక్తప్రవా
హముగాఁ జోరుచుఁ బట్టి యస్తగిరిదుర్గాంతంబున న్వైవఁ
ద,త్క్రియ మాలించి వియోగచింత నతికార్శ్యం బొందు
చుం బద్మినీ, రమణీరత్నము నించు నూర్పు లనఁగా రాజి
ల్లెఁ గ్రొంజీకటుల్. 141

సీ. జంభారిపురిసరిద్దుంభనం బెడఁగోరి
వర్ధిల్లు యమునాప్రవాహ మనఁగ
గమకించి చక్రవాళము దాఁటి యుద్వృత్తిఁ
బొదలినతిమిరంపునది యనంగ
నప్పంద మగుచు మేరుస్పర్ధఁ బెరిగిన

గజ్జలాచలవలత్కాంతి యనఁగ
గగనలక్ష్మీతనూస్థగితమై నిబిడత
దులకించు పచ్చికస్తురి యనంగ
తే. దండధర గదాదండ వేదండ తుండ
నీల నీరద నీలిమ లాలితంబు
జారిణీజారసమ్మోదకారి యగుచు
నంధతమసంబు పర్వె రోదోంతరమున. 142
తే. అట్లు ఘోరాంధకారమాయావరణము
రణ మొనర్పఁగఁ దివురువారలకె కాక
యఖిలజనులకు నిమ్నోన్నతానభిజ్ఞ
తావిచారంబుఁ గలిగె నత్తఱి గణంగి. 143
ఉ. నెక్కొని కర్కశుం డయిననిష్ఠురపుందురకాతఁ డెంతయున్
వెక్కసమైన కోపమున వెన్కొని తమ్ముగి హెచ్చరింపఁగా
నెక్కొనుకోట నల్గడల నిక్కడ నక్కడ నాక తేకువం
గ్రిక్కిఱియంగఁ బాఱి పరికింపఁగ రానిబలం బసంఖ్యమై.
శా. దట్టంబై యుపసవ్యసైన్యచయ ముద్ఘాటించుచు న్మించి తా-
రిట్టట్టై కరదీపికాతతు లిలాయీలు న్మతాబా ల్గడీ
చుట్టు న్నిల్పిరి వేనవే ల్వెలమరాజ్జోదు ల్రయాయత్తులై
లట్టాల్గట్టిగఁ బట్టి బిట్టడచి రా రావుత్తుల న్భ్రాంతిగాన్.
ఉ. వెన్నెల దీర్చి కాచినచవిం గడుచందురుజోతివెల్లువల్
చె న్నెసలార విస్ఫురదసిప్రముఖప్రకరాదిసాధనా
భ్యున్నతి నొంచి చించి రిపుయోధతతిం బదివేవు రన్యమా
సన్నత లైకభాగవినిషణ్ణులఁ జేసిరి మన్నెసైనికుల్. 146
తే. కోటచుట్టును బ్రతికోట గొలిపినట్లు

బిట్టలముఁ గాఁగఁ బీనుంగుఁ బెంట లయ్యె
నట్టులయ్యును బిరుతీక యవనబలము
లక్షలకొలంది పొదువుచు లగ్గ కెక్కె. 147

శా. అర్ణోరాశితరంగమండలభరన్యాయంబుగాఁ బైపయిన్
గర్ణాన్గుండులు నిండి మెండుకొనుచున్ గాఢోద్ధతిం బర్వనా
కీర్ణాంతర్గృహపంక్తి నంగడుల ముంగిళ్ల న్హజారంబులన్
నిర్ణిద్రంబుగఁ గోటలో రిపుభటానీకప్రయుక్తంబులై. 148

ఉ. అప్రతిమాభిమాననిధియైన మహాగుణశాలి రావువం
శప్రభుమౌళి యిబ్బల మసంఖ్యము దీని వధించు టెట్లు భీ
మప్రదరంబునం బిలుకుమారియు నోటమిలేక మించి యీ
వప్రము నిండబారె ననివారణమై యిఁక నిల్వ వోవునే.

ఉ. వేలకొలంది చచ్చుచును వీఁగుచు దక్కినవీరు లెక్కుచుం
బోలినకిన్కచే మిగులఁ బోరుచు నుండెద రిట్టిపట్టునన్
నాలుగువేలకాల్బలమునం దిట మూఁడి యపారమైన యి
య్యాలమునన్ జయించుటడియాసనిజంబని తావితాకుఁడై

సీ. తనతమ్ము నవనిభృద్ధైర్యమహాశౌర్య
వేంగళరాయభూవిభుని నొకనిఁ
దనదుమామ నమేయదర్పదర్పాధీశు
చెలికాని వేంకటక్షితిపు నొకనిఁ
దనబాంధవుని రిపూత్కరవనీఘోరద
వాగ్ని దామర్లదమ్మన్న నొకనిఁ
దనసైనికాగ్రణి ననుపమదోర్వీర్య
నినుగంటి నర్సావనీశు నొకనిఁ

తే. బిలిచి యసమానకక్ష యిబ్బలము పెంపు

తెంపు సైరింపరా దింకఁ దెగువ జేసి
మనల శుద్ధాంతకాంతా ప్రమాపణంబు
నెఱపి యభిమానధనమె మన్నింప లెస్స. 151
మ. బలవంతుం డగు వైరిపైఁ దొడరి దోఃపాండిత్యముల్జూపి రక్
విలసత్ఖ్యాతియు మానరక్షణము సద్వృత్తిం బ్రవర్తిల్లి రక్
కులముం బెద్దలు మెచ్చికొంటయును గల్గున్మీఁద నాతారకా
జలజాతాప్తనిశాకరం బగు యశస్సంపత్తియుం బర్వెడిన్.
ఉ. మానము గాచుకోఁదలఁచుమానుషము ల్గలవారు పౌరుషే
యానకు భూషణంబుకుల మారడిఁ బుచ్చక సాహసించి నా
కీనిపుణప్రతాపధృతి యొన్నిక గావున నస్థిరంపుఁబ్రా
ణానకు డాగి శాశ్వతధనంబు యశం బది మాపుటొప్పునే.
చ. అనిబహుభంగులం దెలియ నాడినమీఁదటఁ దత్సహోదరుం
డనియె విరోధిదుష్టమతి యైన దురాత్ముఁడు రాజు యావనా
వనిపతితద్వశుం డగుచు వర్తిలుఁ గావున వారి నోర్చుచిం
తనమును చాలదవ్వులన తారసిలం గల దంచుఁ దెల్పితిన్.
క. వినరైతి రిట్టిహేతువు
జనియింపఁగ వలసె మనకు సాంఘాతికమై
మొనకొనియె మరణకాలం
బనుమానం బింక నేమి యనవుడు నంతన్. 155
క. చెలికానివంశసంభవు
నలఘుతరస్థైర్యు ననిచె నవరోధవధూ
కులకంఠనాళకృంతన
కలనాదారుణవితానకలితత నెఱపన్. 156
తే. అతఁడు నభిమానరక్షణార్హప్రచార

దారుణాకారసాహసౌద్ధత్య మమర
నంతిపురి కేగ మొఱసె దిగంతరములు
ధరణి వడవడ వడఁకె భూతలము బెగడె. 157

తే. రాయమణి రాణితనకుమారాగ్రయాయి
నపుడు కొండొకదాదికి నప్పగించెఁ
గోట వెడలించి బ్రతికించుకొమ్మటంచు
నట్లు గావించె నద్దాయి యడలువోడమి. 158

తే. మఱియు నారాయమన్ననిమానవతియుఁ
బాణితలమున శాతకృపాణిఁ బూని
దానిచే మేను దొరఁగె మద్వైరివంశ
మకట నిర్వంశ మగుఁగాక యని శపించి. 159

తే. అపుడు పశుపక్షిమృగములు నవనిజనము
లభ్రవాణియు విస్మయం బందికొనుచు
నమ్మహావీరపత్నిశాపమ్మువలన
నట్ల కాఁగల దని కొనియాడి రంత. 160

క. ఘననిశితఖడ్గధారకు
మొనకొని చెలికానివంశమూర్ధన్యుఁడు పెం
పున వడివడి నంతఃపుర
వనితాజనతాతిచిత్రవధ విధి నడపెన్. 161

తే. తక్కఁగల యట్టి యభిమానధనులు వెలమ
లొక్కనూరిండ్లవా రనలోగ్రశస్త్రి
నిహతులై రంగనాథుసహితు లగుచుఁ
దద్విదారణ మెంతని తలఁపవచ్చు 162

తే. శేవతిర్యఙ్మనుష్యాలం బీవిధంబు

పెంపు గనలే దటంచు నిలింపులెల్ల
వెలమవర్ణంపుసాహసవిక్రమములు
భళిభళీ యని పొగడి రభ్రమున నుండి. 163

మ. అపు డాశాకరికర్ణకోటరపుటాహంకార నిర్వాపణా, నుప
మస్వానవిఘూర్ణమానపటహం బొక్కంట మ్రోయించి
రో, షపరీతం బగు మానసంబున ధరా జంభారి రంగ
క్షమా, ధిప రత్నంబు బురుంజు లెక్కిన విరోధిశ్రేణిపై
మార్కొనెన్. 164

శా. దివ్యాస్త్రప్రణిపాతనంబునకు నుద్విగ్నంబుఁ గైకోకప,ద్మ
వ్యూహం బభిమన్యుఁ డే త్తెర విభేదప్రౌఢిమై చొచ్చిన,ట్టవ్వా
జోద్ధతి నేకవీరుఁడయి ఘోరారాతివిభ్రాంతిశ,స్త్రవ్యాపా
రము చీరికిం గొనక యాశౌర్యాఢ్యుఁ డూల్కొంటయున్.

ఉ. సింగపుఁబిల్ల ఝారిఁ బడి చిందరవందరలైన కొమ్ములేటు
నుంగులుపోలె బెబ్బులిఁ గనుంగొని పారెడులేళ్లపోల్కినా
రంగనృపాలుఘాటి కెదుర న్నిట మించుకయేని లేనిపే
ర్మిం గడుభీతి నొందియును మేటిమగల్తు రకల్మషోగ్రులై

చ. పలువురుగూడి యొక్కమొగి బాణకృపాణపరంపరాసము
జ్జ్వలతరచాకచక్యము దిశావలయంబుల కెక్కఁ బాఱ నూ
ర్పులు నిగిడించుచుం జెలగి పోరికిఁ దార్కొనునంత వాలునుం
బలుకయుబూచిపట్టినరపాలశిఖామణియోవాటించుచున్.

చ. తరమిప్రతాపదర్పితులఁ దద్రిపుయోధుల నూచముట్టఁగాఁ
గరములు పెందొడల్దలలు కంఠతలంబులు చెక్కుచెక్కగా
నరకుచు దూగి పాఱ వడి నల్వుర ముప్వుర హత్తికుత్తుక
ల్దరగెఁ జలంబు చేధుమికి లాఘవలంఘనలక్ష్యచాతురిన్

చ. పరెవరలైన, మేనుల నపారములై ప్రవహించుచుండ నె
త్తురు జడిసోన వెల్లువలు తూములు వెట్టినయట్లు వచ్చి పె
న్నురువులు గట్టిపాఱ యవనుల్బెగ డందుచు వీఁగి వచ్చియు
ద్ధురశరజాలము ల్వఱపి తుత్రించిరి రాయకరాగ్రఖడ్గమున్.

ఉ. ఉక్కున మిక్కుటంపుఁ దమి నొక్కట నుక్కుటలుంగుటీఁటు
కెం, పెక్కఁ గనుంగవం దొరఁగు నింగిలపు న్రజ ముప్పతిల్లఁ
గాఁ, గ్రక్కున బూచి పట్టి భుజగర్వసమున్నతు జానుఖాను
నిఁ, డొక్క యగల్ప వాఁ డవనిఁ ద్రెళ్లను రాయనికుంత
సంహతిన్. 170

మ. ఉదితక్రోధమునం బెనంగు నృపవర్యుం జూచి జంత్రాల్మహా,మ్మ
దుహాబ్సేనుమయూరుదారుణరణోన్మాదంబునం డాసి యు
న్మదుఁడై యుమ్మరిఁ బోసి రేఁచి తునిమె న్రావన్వయోత్తంసు
చే, తిదృఢంబైననిశాతకుంతము హఠాద్వేగంబుచేనత్తఱిన్.

ఉ. రావుకులాగ్రగణ్యుఁడవురా భళిజోదువునీవె యంచు పీ, రా
పలి మెచ్చఁ గ్రచ్చఱ శరాసనముం గొని యంబుఁ గూర్చి నీ
చేవ యణంతుఁ జూడు మని శాతశరంబునఁ ద్రుంచె నిష్ఠురా
రావ మెలర్ప వానితల రౌతులు భీతిల జాతశౌర్యుఁడై. 172

చ. అది గని రోషదూషితహృదంతరుఁడై తరవారు దుస్సిదో
ర్మదము వెలార్చుచుం బిలుకుమార్చి ననేకులయోధవీరులం
గొందగొని సంకెల ల్గడపుక్రొల్పులిపోలిక నీతఁ డింక నే
జడిపెద వీరినం చెదిరి సాహసశాలిబిలాలురాయనిన్. 173

తే. అట్లు చనుదెంచువాని దురాగ్రహాగ్ర
హాగ్రసితచిత్తు నతిమత్తు నప్రవర్గ్యో
ఘోరరథినీయుతునిఁ జూచి యాఱర వీని

సాహసోత్సాహ మని కడు సరభసమున. 174

మ. చలముప్పొంగ నభంగసంగరకళాసంరంభియై యిట్లు మి
న్నులు ముట్ట న్గరులంటఁ దూపుగముల న్నో నేసి యే నేసి
యు,మ్ములకు మ్ముల్వడి రొమ్ముటెమ్ములగల న్మ న్నేసి యన్నేసి
మూ,ఱులుచే వెళ్లినపోటు లోటుగని తీరుఁ బాకు సారిం
చుచున్. 175

మ. అరివర్గంబులు జుట్టిముట్టి తనబాహాహంకృతిస్ఫూర్తిఁ జా
పఱు లగ్గింప నిలింపకోటిచదలం బైపై నిరీక్షింపఁ ద
త్కరవాలమ్మున రంగరాయవసుధాకాంతుండఖండోద్ధతిఁ
శిరముం ద్రుంచెఁ గరీంద్ర మబ్జముబలెం శిద్దిబిలాల్ఖానునిన్.

చ. ఇట్లమ్మహీమండలాఖండలుం డుగ్రవేదండంబు శుండాదం
డంబునం గమలషండంబు దెమల్చినపగిది నిజభుజాగ్రజా
గ్రన్మండలాగ్రంబున నుదగ్రభంగిం గదిసి సవ్యాపసవ్య
ప్రచారంబులం జెలంగి సెలగిసైచుచుం బ్రచండగతి నఖం
డదోఃపాండిత్యంబు నెఱపునప్పు డుప్పరం బెగసి ఛత్రపతి
ప్రభృతిరజపుత్రవ్యూహంబును షుకురుల్లాదిసాదినికురుంబం
బులును బహుపదాతివిసరంబులుం బ్రసారిత కరవాల భిం
డివాల నిశిత విశిఖ జాల ప్రముఖ నిఖిల సాధనులై యా
యోధనంబున నయ్యశోధనుం బొదివి పదివేవు రేదువెఱ
కినకరణిం గఱకుటంప జల్లుజల్లునం బయిం జల్లుటయు గా
యమ్ము గాయమ్ముల వఱ్ఱుగా నోన్నాటినం దొరఁగు శోణితా
సారంబు మేర మీఱం గుసుమితకింశుకాకారంబు పూని
యుం దిటంబు సడలక కొంతసేపటికిం బడలిక గ్రమ్మం గ్రమ్మ
ఱఁ జముదాడువెఱికి జళిపించుచుం బ్రత్యాలీఢపాదస్థుం

డయి నిలిచి హుంకరించుచుం దఱుముచుం గదిరివయిచు
చుం గొంతదడవు పోరి యనంతరంబ బలిమి దఱిగి మైపోలి
తొరఁగి మింటికెగయు తగరుజక్కులికపోలికం బ్రద్యోత
మాన జ్యోతిర్మయస్వరూపమ్మున నమ్మహావీరపురుషమూర్తి
మూర్తిత్రయీమండలుం డగు మార్తాండునిమండలంబుఁ
జించుకొని యభ్యంచితప్రకారంబున నిద్దివిజపురి కరుగు
దెంచె నప్పుడు. 177

ఉ. అవ్వల నెట్టులుండెను దదాత్మజుఁ డాధరణీశుసోదరుం
డెవ్విధిఁ గానరై రిదుర మిట్టి విదారుణవృత్తిఁ బర్వుచో
నెవ్వగ మానె నిట్టికరణిం ధరణీజనకోటికాత్మనం
చవ్వెయిగండ్లవేల్పడుగ న్వాలపుదిండ్ల యగార లిట్లనున్.

వ. అంత నగ్గడీదుర్గంబుసందుఁ గ్రందుకొని యమందమంద
రాచల విఘూర్ణమానార్ణవమధ్య ప్రభూతభీతికరకాలకూ
టానలజ్వాలాభీలంబై దవానలావేశితకుత్కీలంబుచందంబు
నం గీలిలీలాకలాపం బపారంబై ప్రళయకాలానలంబై ప్రవ
ర్తితవైశ్వానరప్రతాపంబులం దిరస్కరించుచుఁ జిటచ్చిట
చటచ్ఛటార్భటీనిర్దళితదిక్కోటరం బగుచు నుద్దండ దండ
ధరమండలాగ్రంబులం బోని చండ జిహ్వామండలంబులు
పుండరీకప్రభవాండభాండంబు మండిపడం జేయ భూయః
ప్రకారంబున నిండికొనుచుం గండు మిగిలి యనేకప్రకార
విధ్వస్తస్త్రీబాలవృద్ధాది బహుప్రాణిలోకభీకరంబై తొంటి
కాలంబునాఁటి ఖాండవదహనంబుచందంబున నిర్ధూమ
ధామంబుగా మండం జొచ్చె నప్పు డుప్పరం బెగసి బురుజు
లెక్కిన ఫరాసుమండలంబు లుద్దండ వేణుదండ మండలా

ఖర్వపర్వపటపటాత్కారంబు ఘోరంబై యనేకశతఘ్నికా
నికాయనికామ భైరవారావశంక ననుకరింపం జంకు వొడ
మి పుడమికిం దిరుగ నుఱికి మహాద్భుతరసవిభుగ్నమానమా
నసులై గడీక నతిదూరంబునం దిరుగువారం బరువకట్టి
నిలిచి రాసమయంబున. 179

తే. దాదిగొనిపోవు రంగరాట్తనయమణికి
నడ్డమే తెంచికొనిపోయి యవనపతికి
నప్పగించిరి తద్భటు లాదరమున
నతఁడు నబ్బాలు నతికరుణార్ద్రుఁ జేసి. 180

ఉ. ఆదారసోదరుం డగు బలాఢ్యుఁడు వెంగలరాయమౌళి తా
హైదరుజంగులస్కరునకై సడవం దలఁచె న్యుగాంతవే
ళాదవపావకాకృతి నలంఘ్యపరాక్రమదర్పితాత్మసే
నాదృఢబాహుసాహస మనంతవికాసము నింపఁ దృప్తుఁడై.

ఉ. భాసురశౌర్యుఁ డాంధ్రకులపావనుఁ బాపనృపాలవర్యు ము
న్నే సమకొల్పె రంగధరణీధవమౌళి మదగ్రజుండు దు
శ్శాసను నోహటింపఁ దగు సాహసవంతుఁడు భీమసేనుఁ డే
కాసడి సన్నవాఁ డనినకై వడి రాజు బలంబు డింపఁగన్. 182

ఉ. కావున నింక లష్కరుచి కాకుపడ న్జగడం బొనర్చు టే
చేవ యటంచు నెంచి నృపసింహ మఖండితరోషఘూర్ణమా
నావిలమానసుం డగుచు నాహవదోహళకాహళానకా,రా
వము మిన్నగల్ప నగరాజితగోపుర మెక్కి యుక్కునన్.

తే. ప్రకటబలుఁ డందు నిలిచి నాలుకలు గ్రోయు
నుగ్రతక్షకకర్కోటకోపమాన

మానసీయశతఘ్ని కామండలంబు
నాదుకొలిపించె లష్కరుమీఁదఁ బెనఁచి. 184

సీ. ఒకఫిరంగీగుండు నికటస్థలీవల
ద్బృహుసామజములఁ గుప్పలుగఁ గూల్చె
నొకజజాయీవ్రేటు ప్రకటఘాటీనట
ద్వరఘోటకములఁ జుప్పర మడంచె
నొకరేకలాదెబ్బ యుద్ధతారాతిరా
ట్పటకుటీరములకంబము లగల్చె
నొకతుపాకీతాఁకు సకలారిసైనిక
నికరాంగలతికల వికలపఱచె

తే. మాటుమఱుఁగున గుఱిఁ జూచి వేఁటకాండ్రు
మెకములఁ దెరల్చుచాడ్పున నొకట నొకట
లష్కరు చికాకుపడ సేయ లలి దొరంగి
రాజశిబిరంబు లేచి దూరంబు దొలఁగె. 185

చ. అపు డుదయాద్రిమీఁదఁ గన నయ్యె సుధాంశుఁడు దచ్ఛ
తఘ్నికా, విపులరవార్భటు ల్దెలియు వేడ్క నధోభువనం
బున న్సరీ,నృపపతి లేచి పూర్వశిఖరీంద్రము పేరిటి పుట్ట నె
త్తున,చ్ఛపుఫణ మట్ల తత్కలిత శార్ఙ్గపదం బనఁ దోఁచు కం
దుతోన్. 186

క. నెలపొడిచెం జెంగలువలు
నలివిడిచెం జక్రవాకనయనోదకముల్
జలజలవిడిచె న్వెన్నెల
జిలజిలదిక్కులకు నొడిసెఁ జీఁకటు లెడసెన్. 187

వ. తదవసరంబున. 188

సీ. కదనరంగస్థలి కలియుగార్జునుఁ డన
నలరారు రావుచిన్నయ్యగారు
కాకర్లపూడివెంకటరామరాజాది
తేజోదివాకరుల్ రాజపరులు
యినుగంటివంశపావనులు ధర్మారాయ
నరసింహరాయభూనాథముఖులు
పరుషాభియాతిభీకరసాహసౌద్ధత్య
బాహుశౌర్యులు కంది బండవార

తే. లాదిగాఁ గలశూరాగ్రయాయులెల్ల
బలసి యిరుదెస నడతేర నలఘుపటిమ
భర్గభార్గవవిక్రమప్రక్రమంబు
డంబు నెఱపంగ గదలి బీరంబు మెఱయ. 189

సీ. బిన్నినిఁ బఱతెంచు బిరుదు రాహుత్తుల
కత్తులతళతళ ల్కార్కొనంగ
నిరుచక్కఁగనుపట్టి యెలగోల్తుపాకుల
మూకలకల్లకలంబులు చెలంగ
బారుగా నిలిచిన పందీటిమొనగాండ్ర
కనుగాండ్రతనము భీకరత నెఱప
నురవడిఁ బఱతెంచు నొంటెవస్త్రాదుల
మస్తాదు లంతంత మురువుఁ జూప

తే. వెలమదొరలెంద ఱేని దోర్వీర్యకలనఁ
గలనఁ బిరుతీనిముగఁటము గెలువ నుఱక

కఱకుదన మొప్ప నపుడు లష్కరున కెదుర
వెంగలనృపాలమణి కోటవెడలి నడచె. 190

ఉ. ఏనిక దోయిమీఁద నెనయించు డమారపుటోకు లాకసం
బానఁ బ్రభాసమానసనుదార్భటిమద్భటకోటిసింహనా
దానకు దానకుంఠితమదద్విరదాకృతి గాంచి శత్రుసం
తానము భీతిల న్నడచి డార్కొనె వెంగళరావు లష్కరున్.

మ. అవనిం బెల్లుగఁ బద్మనాయకులు దృప్యద్వైరివర్గంబుపైఁ
గవియం దానును బద్మనాయకసమాఖ్యం బూని యిట్లుం
డుట, ధ్యావె యంచు న్రుషచే మహోన్నతగజారూఢస్థితిం
బొల్చె న్నా,రవిబింబం బుదయాచలేంద్రశిఖరాగ్రం బెక్కె
శోణద్యుతిన్. 192

ఉ. దృప్తనిరోధియూధములతో నెదిరించుటకై చతుస్సహ
స్రాప్తబలంబుతో నెదిరి సాహసధుర్యుఁ డితండు జూడ సం
సప్తకకోటిపైఁ దొడర సాగిన క్రీడియె కానిచో సము
ద్దీప్తము లతుపాయదళ దీని నెదుర్పగ నొర్ల కొప్పునే. 193

చ. అని యవనీజనంబులును నభ్రచరు ల్వొరఁ గంది చూడము
న్మనుజనిశీకిమార్కొనుట ముఖ్యముగాఁ దలపోసి తూఁగునె
క్కొనుకినుక న్నిజాప్తభటఘోరశరాగ్నులఁ జుట్టుముట్టి క్ర
క్కన రవళించుచుం దదధికారి పుళిందవని న్దహించుచున్.

చ. అతులితబాహువిక్రమసమగ్రత నిట్లరుదెంచు వెంగళ
క్షితిపుబలంబుమీఁద జినిసీపయి కాపు వసించు యోధసం
తతులు ధమాధమీనినదదర్పితభూరిశతఘ్నిక ల్రయో
ద్ధతి నిగిడింప నప్పగిటఁ దాకి మగంటిమిచూపు తెంపునన్

సీ. బహువీరభటవారకహాకహార్భటులకు
రణభేరికాధాంవిరావములకుఁ
జటులతురంగహేషానిస్వనములకుఁ
గరిఘటాపటలఘీంకారములకు
రాహుత్తఖడధారాచకచ్చకలకుఁ
గోదండశింజినీనాదములకుఁ
గరలి మ్రోఁగెడు తుపాకీధాంధమీలకు
రహఫిరంగీగుండ్ల రాకడలకు
తే. దిటము చెదరక బెదరక యడరుదొట్టి
కిట్టిలముగాక జినిసీని జుట్టుముట్టి
కుప్పికుప్లాము మొదలుగా నొప్పువారిఁ
దదధికారులఁ జంపిరి దర్ప మెసఁగ. 196

తే. అప్పటిరణంబునందైన నొప్పి దప్పఁ
లెన్న నిరువాగునందు న న్నిన్ని యనక
జరిగె నభిమన్యుయుద్ధావసరసముద్ధ
వీరరససంహతానేకవీరసరణి. 197

చ. కదన మపారమై పఱచెఁ గత్తులు గత్తులు నీటె లీటియల్
గదియ నెకాయెకిం బడి చెకాచెకలై తునియంగ నొండొ
రుల్, చెదరక గ్రమ్ము నెత్తురులు చిమ్ముకరమ్మున జొత్తుపాపలై
చిదురుపలై ధరం దొఱఁగి చెయ్వులు దక్కి భయంబు నిం
పుచున్. 198

మ. అమరుల్దానవులు స్వరోషకలనాహంకారులై తారసిల్లి ము
దం బుచ్చి చనం బెనంగునటు లోలిం దాఁకి యన్యోన్యఖ

డ్గముఖాఘాతములఁ న్నిరశ్చరణవక్షఃకంఠము ల్వ్రీస్సి తు,త్తు
మురై రయ్యిరువాగువార లవుడాదోనొమ్మియుద్ధంబునన్.

సీ. ఈటె లీటెలఁ జుట్టి యెగచి కఠారము
లౌఱకి పేరురముల విరియఁ గ్రుమ్మి
తరవారు తరవారు నొఱసి మిణుంగురు
ల్గురియంగ జబ్బల కుఱికి నరికి
బల్లెము ల్బల్లెలఁ బాపి చంకిలి డాసి
యలుగక డంబాన నంటఁ గ్రుచ్చి
క_త్తిక_త్తి నగల్చి తుత్తునైరై రాల
విసరి యొండొరువులఁ గసి మసంగి

తే. గుండియ ల్వ్రీల నేజాల గొఱిఁది గ్రుద్ది
ప్రేవు లురులంగ సాదుల జావఁ బొడిచి
పోటుదోటోనిబిరుసునఁ బోరి రిట్టు
లుభయసైనికయోధు లాయోధనమున. 200

చ. కణఁగి పరస్పరంబు సెలకట్టకపోరుడు. ఘోరయుద్ధ మా
ఫణిపతికి న్వచస్పతికి భారతికి న్వశిపోవ దెంతయుఁ
గణుతి యొనర్పనైనది గన్గొనఁ జొప్పడు తొంటి రామరా
వణు లరణంబుకన్నఁ గురుపాండవయుద్ధముకన్న మిన్ననై.

వ. మఱియు నవ్వీరపుంగవుం డగు వెంగళరాయధరాపురంద
రుని బలంబులు భుజాస్ఫాలనంబులు సలుపుచుం బలంబున
నావిష్కృతక్రోధరసాధీనులయి ముష్కరతురుష్కధాను
ష్కానీకినీనికాయంబుఁ బొదివి హ్యతప్రత్యాహతంబులు
గాఁ బోరిపోరి యితరేతరకరవాలధారానిపాతంబును బర
స్పరకఠారికావిపాటనంబును నన్యోన్యకుంతనికృంతనంబును

మిథఃకర్కశగదావిదారితశారీరావయవంబునుం గావించు చుం బిరుతివియక ఖడ్గాఖడ్గియుం గుంతాకుంతియుం గచాక చియును బాహాబాహియునుంగా సంకులాహావం బతి భయావహం బయి పరఁగం బ్రవర్తిల్లు నప్పుడు. 202

క. ఒకధూము రేఁగి లస్కరు
పికపికలై తుములరణము పెంపున నన్యో
న్యకరాసిసంహతులచే
వికలతఁ గని రొరులు తమరు వీ రనుకొనకన్. 203

సీ. సంకెల ల్దెగ నూడ్చి సాధ్వసావిలములై
బెగడొంది పఱచు స్తంబేరములును
గట్టుత్రాళ్లు గలించి కళ్లెల క్కాఁగక
భీతిల్లి పరువెత్తు వీతితతులు
తరవార్లు మఱచి కత్తళములు జీరాడ
నూడనిఁబాడు రాహుత్తవరులు
దంటుకల్లిల్లిచే నొఁడొండుగానక
కానకై జరగెడు కాల్బలంబు
తే. లాయురవశిష్టులై తారుగాయగాండ్రు
జీవితాశలు వదలి భుజించుకొన్నుచు
నొరలు బిబ్బిలు నగుచు లష్కరు చలించె
మందరోన్మథితాంభోధిచంద మొందె. 04

చ. అపుడు నబాబుదుర్గమతమాద్భుతశౌర్యపరాంగ వెంగళా
ధిపభటనిర్ణిరోధఘనముద్దీర్ణపరాక్రమదీర్ణనై జయూ
ధవగితదైన్య మారసి నితాంతసమాకులచిత్తవృత్తియై, నృ
పవరుఁ బూనపాటికులునిం గని యిట్లనియె నర్పియమ్మునన్.

ఉ. వెంగళరాయ్యఁ డెంత రణవీరుఁడొ కాని నితాంతవిక్రమా
భంగురశక్రసూతియయి భాసిలుచు న్మదుదగ్రసర్వసే,నాం
గములెల్ల తుళ్లడచె నాతని యాహవకేళి కిప్పు డె,న్నం
గఁ ద్రిగర్తసైన్యము లనం గనుపట్టెడు నిబ్బలావళుల్.

క. రేచెర్లగోత్రసంభవు
లై చెన్నగు వెలమవారి యభినవశౌర్య
ప్రాచుర్యబలముఁబోలిన
దేచాయం జూడ మవని హిందువులందున్. 207

సీ. మెకములనడుము చించుకవచ్చు బెబ్బులి
పోలికె బొబ్బిలిపురినృపాలుఁ
డుడివోని కినుకచేఁ దొడరి యీశిబిరంబు
నడిబారు చొచ్చి వెన్నడినవారు
ఘోరదావాగ్నిచే నీరసారణ్యంబు
బొడ వడంగుడునట్లు కడిమిదొరఁగి
చనిరె నస్మత్సేనసంగ్రామరంగంబు
పీనుంగుపెంటలై పేర్చె నింక

తే. నేమిసేయంగ నోపుదు నేర్పరించి
వీరు నెవ్వాని నొడఁగూర్తు వీరినోర్వ
మున్నె సేనాధిపతులెల్లఁ జన్నవార
లంతకునియింటి కంతంత నతిథు లగుచు. 208

తే. వారు స్త్రీబాలవృద్ధసంహారఘోర
దారుణవిపత్తి కొడఁబడి బారుకట్టి
మరణమున కెత్తివచ్చు నస్మానధనులు
బహుజనహతింబు సేయరే భండనమున. 209

తే. రావువారల యుగ్రశౌర్యప్రసంగ
మది యమానుష మని వింటి మ ల్లితింగి
నీదురాలోచనాసముత్పాదనమునఁ
గానలే నైతి నిటువంటిహాని యగుట. 210

మ. తెగి వంచించినఁ గార్యహాని యగు నీతీవ్రప్రతాపంబు గా
నఁగ నౌ మీఁదటఁ దద్బలప్రథితజన్యప్రౌఢితో నుండి రా
పగ సాధించుట కీవు సైన్యపతివై బాహాబలోద్వృత్తి చూ
పి గురుత్వంబు వహింపు మింక యనినన్ భీతిల్లి రాజోర్వుసన్.

క. విధివోమినట్ల యగు నని
పృథురభసం బొప్పఁ దురగభీషణహేషా
విధురితదిఙ్ముఖుఁ డగుచుం
బ్రధనమునకు సరుగుదెంచి పార్థివుఁ డలుకన్. 212

మ. భుజగక్రూరశరాసవల్లరికరాంభోజంబునం గీలుకో
ల్పి జిరాగుజ్ఝపుఘోఁజుతోడ నతఁడుం బెల్లార్చి కాకర్లపూ
డి జగన్నాథధరాధినాథు లగు రాడ్వేదండము ల్పుట్టి రా
నిజగోశ్వార్యము చూపఱు ల్మిగులమన్నింపంగ నత్యుద్ధతిన్.

తే. నడచె వెంగలరావుసైన్యంబుమీఁదఁ
దనభుజాదండమండితధనురఖండ
చండమౌర్వీనినాద ముద్దండ మగుచు
సకలదిక్కాండజనములఁ జెవుడు పఱప. 214

చ. పరుషపరాక్రమాభినవభార్గవమూర్తికి వెంగళక్షమా
వరున కెదుర్ప లేనని యొ వారక తాండ్రకులీనుహేతిశాం
కరికసుభిక్ష నేయనగు కాఁతుసనో నెమ్మదిలో జనించె న
త్త్వరతరమై పలాయనపుయోజన యాజననాథమాళికిన్.

శా. ఆరాజన్యునిఁ జూపెఁ బ్రళయరౌద్రాకారుఁడై పేర్చుచున్
వీరగ్రామణి రావువంశమణిదోర్వీర్యాధరీభూతనా
నారాతిం జెలికానివంశజుని నన్యాసాధ్యుదమ్మన్ననున్
ధీరస్వాంతుల కందిబండకులులం దీకొల్పె నుద్వేగుఁడై.

శా. వారు న్ఘోరశరాసవల్లరుల నిస్వానంబు లభ్రాపగా
నీరేజాంతరధార్తరాష్ట్రభయకృన్నీరంధ్రమంద్రధ్వనిన్
మీఱ న్రాజవతంసుసైనికులపై మేకొంటయుం దచ్చమూ
వారంబు ల్పురికొల్పి డాసి రతిదుర్వారాసిధారారుచిన్.

మ. పులులుం గ్రొల్పులులుం గరు ల్కరులునున్ భూమీధ్ర
ము ల్భూధరం,బులు నంభోనిధులం బుధు ల్గదియు చొప్పు
తెల్పుచున్ రాచబిడ్డలునుం వెల్మదొర ల్దురమ్మునకు నొడ్డా
రించి క్రొవ్వాఁడి బా,కులతో గ్రుమ్మెసలాడ సాగి రలుకన్
గోవిందశబ్దార్భటిన్. 213

సీ. కరికాండతుండద్రుఘనతాడనంబుల
వకవకలై కృకాటికలు పగుల
భీకరకరవాలభిండివాలాదుల
దాఁకుల నొగిలి కంధరమ్ము లగలఁ
బరిఘనిష్ఠురభూరిపరీఘాతనమ్ములఁ
దుండమ్ము లగుచుఁ బెందొడలు విఱుగఁ
బుంఖానుపుంఖప్రస్ఫూరితశరవృష్టి
నెమ్మోముఁ దమ్ములయెమ్మె చెఱుప
తే. నిరుపమానాహవోద్వేగనిర్ణిరోధ
విక్రమక్రమనైపుణీవినిహతాత్మ

పరచమూమండలముగాఁగ నురువడించి
యొండొరులఁ దాఁకి పెనఁగిరి గండుమెఱసి. 219

మ. హయరింఖాతతధూళిధూసరితమై యాగ్నేయయంత్రావళీ
రయనిర్యద్బహుధూమసంవళితమై రక్తాంబుధారాసము
చ్చయసంఛాదితమై ధనుర్విగళితాస్త్రధ్వస్తసేనాతనూ
భయదంబై కనుపట్టెఁ దత్సమరభూభాగంబు భీభత్సతన్.

సీ. శాక్తికపఙ్క్తిపై శాక్తికానీకంబు
చక్రిహస్తులమీఁదఁ జక్రిధరులు
శస్త్రపాణులమీఁద నైస్త్రింశికావళుల్
నైస్త్రింశికులమీఁద నస్త్రధారు
లస్త్రధారులమీఁద నసిముసలాయుధు
లసిమౌసలికులపై నాశ్వికులును
నాశ్వికసమితిపై నలుకగాంతికులును
గాంతికవ్రజముపైఁ గావచికులు

తే. తూఁగి యిరులాగుదొరలతోఁ దొడరునపుడు
తుమురుతుమురును బొడిపొడి దుమ్ముదుమ్ము
నున్నినున్నియు నురుమునై చూడనయ్యెఁ
గదనరంగంబు నూర్పిడికళ్ల మగుచు. 221

మ. మరణేచ్ఛారతిఁ బద్ధనాయకులధర్మవ్యక్తదోస్సారసంగరు
లై రాచకులంబువారు సరిగాఁ గయ్యంబు వాటించుచోఁ
బరుషారాతితమస్సముద్ధతిహృతిప్రజ్ఞాసరోజాప్తులై, యురు
సంరంభవిజృంభితాగ్రహముచే నొప్పారు వేంద్రంబునన్.

సీ. జగడంపుటంచులేనుఁగులపై కుఱికి బి
ట్టురిమి తుండంబులు పరికినరికి

పందీలు లులుగంటిపార నుక్కున శిలే
        బత్తరుగుజ్జాలబసికిబసికి
వెన్నులు సరికట్టి విసిరి సిఫాయీల
        చిప్పయీటెలఁ గ్రుచ్చి చిమ్మిచిమ్మి
కడిఖండములుగాఁగఁ గాల్వుర పేరెద
        ల్చికిలీకతారులఁ జించిచించి
తే. యలుకమై సూర్యసోమవీథులు పడంగఁ
గొట్టి గోరించి లష్క రిట్టట్టుపఱచి
తూలితుండెంబు వాడుచు దురమునందు
విక్రమప్రౌఢి నెఱపిరి వెలమదొరలు. 223

మ. అరిరాజన్యపయోధి నిర్మథనదీక్షారంభసంరంభమం, దరు
తా వారలఁ గిట్టి నెత్తురు వసంతంపుం జడిం దోఁగఁగా
శరవర్షంబులు గప్పి రప్పు డలుకన్ శస్త్రాగ్రణు ల్కార్ముకో
త్కరమౌర్వీనినదంబు లంబునిధినాదంబు న్విడంబింపఁగన్.

మ. కరవాలమ్ము లొఱ ల్వెడల్చుకొని ఖడ్గాఖడ్గిగా నంత దా
మరదమ్మప్రభుఁ డాదియైన వెలమ ల్మత్తద్విపశ్రేణి తా
మరపువ్వు న్గొలనుం బలెన్ గలన భీష్మప్రౌఢదోఃక్రీడ చూ
పి రొగిన్ నెత్తురుటేటి వెల్లివరద ల్వెల్లిఁతలై పాఱఁగన్.

మ. అపు డన్యోన్యశరాసిభీషణరణవ్యాపారపారీణతన్
రిపులాటోపము లొప్ప రాచకొమరు ల్వెల్మ ల్బహుక్రోధవై
రపరీతాత్ములునై పరస్పరహతిం బ్రాణాంతపర్యంతముం
జపలత్వంబు వహింప కిట్లు పెనఁగెన్ సంగ్రామరంగంబునన్.

తే. శోణితనదీపరంపర లూనెడనయ్యెఁ
దేలియాడెడు మత్తశుండాలజాల

చలదురుకళేబరముల నావలఁగమించు
మావటీ ల్కర్ణధారుల తీవిఁ దెలుప. 227

తే. అట్టిజగడంబుఁ బటిమభయంబుగొలుపు
టంతయు నెఱింగి బొసట యనిచెఁ దనదు
మూలబలముల నారాజముఖ్యుఁ గవియ
నపుడు హైదరుజంగు రయంబు మెఱయ. 228

ఉ. ఆదళమీాద మార్కొని యహంకృతి మత్సరవాహినీసము
త్పాదితఘోరవీరరణపాండితి యొర్చుచుఁ జెందుబెందుగా
మోదిరి వెల్మవార లసి ముద్గర పట్టిస భిండివాల శూ
లాదుల సాదులం ద్రిజగదద్భుతశౌర్యరసంబు పెంపునన్.

శా. ఆదుస్సాధులు సాదు లప్పుడ యుతాశ్వాసాదితస్తోములై
మీాఁదం జెందెడుబాణవర్షములచే మేను ల్సరంధ్రంబులై
ఛేదచ్ఛేదములై పడ న్నడఁచి కాశీసేతుపర్యంతభూ
ప్రాదుర్భూతయశోభిరాములగుచుం భాసిల్లి రాభూపతుల్.

క. శంకాతంకములేక ని
రంకుశగతి నడచి బలచయంబులతోడన్
వెంకయ్య మొదలు గలవీ
రాంకుల మైదొరగి చేరి రమరావతికిన్. 231

తే. వెంగళనృపాలమణియు నిజాంగలతిక
గాయములవల్లిగా మహోగ్రాజియందు
ఖానుసాహెబుఢేరాకు గదియ నడచి
చేర్చె నిల మేను ప్రాణావశిష్టుఁ డగుచు. 232

తే. లక్షదళమీాద నాలువేల్దళముతోడ
కయ్యమున కెక్కుట సమానకక్ష యనుచు

నిర్వైరపడంగ వలువదు నవ్వుగాదు
దీపమింతైన గొలుపడే తిమిరహృతికి. 233

ఉ. ఆరణమధ్యసీమ హతులైన బలంబుల నిందు నందు వే
ర్వేర వచింప నేలపటువిక్రమధుర్యులు రావువారిలో
వారల రందరుణ యువనవర్గములో గజరాజసంగతం
బైరహినొక్కలక్షపడిరందుల నొక్కొకరుండు దక్కఁగన్.

వ. అప్పు డయ్యావనశిబిరంబు గ్రందుకొని. 235

సీ. వాజిశాలలు రిక్తవాహంబు లగుటయు
నదరురావుహుత్తుల రొదలుకతన
నాలానములవారణావలిఁ గానని
హస్తిపకుల యఱగలార్పుకతన
భర్తృజామాతృసౌభ్రాత్రాదు లాజిలో
వ్రాలుట కొంఱలు బిబ్బిలకతన
రహితాప్తవర్గమై బహువిలాపములఁ
బొరలు సైనికసముత్కరముకతన

తే. నొంచి కాకు వహించి యత్యుగ్రుఁ డగుచుఁ
దడయ కేతెంచి యప్పు డుద్ధతులములుక్క
చాల నిందించె హైదరుజంగుఁ బిలిచి
యిట్టిదురవస్థ నినుఁ గూర్చి పుట్టె ననుచు. 236

ఉ. బొబ్బిలివారితో మనకు బొం దుచితం బని మున్ను మందరుం
డుబ్బి లిఖించె నాతనిహితోక్తి గ్రహింపక జిడ్డు దెచ్చి పై
నబ్బురు మైనికిల్బిషపుటంబుధి మించితి వింతపట్టు నీ
కబ్బదె కొద్దినాళ్ల కహహా యిఁకఁ జేసినయంతఁ దప్పకన్.

క. అని నిష్ఠురోక్తు లాడుచు
ననిలో మఱికోటలోన నరయుచుఁ ద త్త
జ్జనవిసరమరణదీక్షా
జనితాశ్చర్యంబు మదివిషాదముఁ గొలుపన్. 238

తే. యుద్ధరంగంబునం బడియున్నవీరు
జీవశేషుని వెంగళరావు నరసి
చాల మన్నించెఁ దనకృపాచ్ఛాదనమున
నతనియగ్రజతనయ సంయుతముగాఁగ. 239

శా. మూసాబూసి కృపాప్రసాదమున కామోదించి యా వెంగళ
త్మాసంక్రందనుఁ డన్న లేఖామరుతో శారీరశస్త్రిప్రణా
యాసంబుం బెడబాసి సర్వధర్మణీశాభ్యర్చితఖ్యాతిచే
భాసిల్లెం దనమే లపహింపనిరిపుప్రాణాలిజాలిం బడన్. 240

తే. విజయరామరాజు వెంగళరావుతో
ననియె నీదు బంధుహితజనంబు
చనిన పిదప నీవు సంత్యక్తనుండవై
చనక బ్రతికి తేల యనెడు నంత. 241

క. నీవిభవమెల్లఁ గనుఁగొన
జీవించినవార మిట్టిచేష్టకు నీకుం
గావలయు పనులు దైవము
గావించు నటంచుఁ బలికెఁ గనలి యతండున్. 242

శా. ఆ రాజన్యునిరాకపోకడల తూర్యస్వాన మాలించి దు
ర్వారక్రూరతరాఘుపుంజ మితఁ డౌరా యంచు నీనేలపైఁ
బారేచీమలు మింటిత్రోవ నరిగేపక్షుల్మోద ల్గాగ సం
హారు ల్దూరనివారు వానవెలిగాఁ బవ్వారు లే రుర్విపైన్.

వ. తదనంతరంబున నారాజకుంజరుండు దనయభీష్టసిద్ధికిఁ దద్దయుం బ్రమోదం బందుచు నిజశిబిరంబునం బటకుటీరంబులో నోలగం బుండి బొబ్బిలిపురంబునం బట్టాభిషిక్తుండ నగుదు నని తత్పురాలంకరణంబునకుం దత్సమయసముచిత మంగళద్రవ్యానయనంబునకు నచటికిం దన దేవుల సమాకర్షణంబునకుం బ్రయత్నంబునం బొరలుచుండె నంత మఱునాటిదివసంబున. 244

శా. రాజన్యైకవధావధానవిధికై రంగత్సుమానేతముల్, రాజీ
వాప్తసమానతేజు ననివార్యస్థైర్యధైర్యాచలుల్, రాజాం
కోట నమర్చె నేఘనుని ధీరస్వాంతుఁ డాకీర్తి వి, భ్రాజచ్ఛౌ
ర్యుఁడు తాండ్రవంశజుఁడు తద్భారంబు తాఁబూనుటన్.

మ. తనజామాదినిబర్హణజ్వలితవార్తాకర్ణనోత్థవ్యథా, జనితంబై
పెరరేఁచురోషపటిమన్ క్షత్రాగ్రగణ్యైకహిం, సనదీక్షార
తియై పరాక్రమము మించం దాండ్రపాపయ్య చ,య్యన నా
త్మీయుల నిర్వరం దనకు సాహాయ్యంబుఁ గావించుచున్

ఉ. దేవులపల్లి పెద్దనృపతిప్రవరుండును బుద్ధరాజు వెం
కావనిభృచ్ఛిఖామణియు హైహయుసన్నిభవిక్రమాఢ్యులై
క్రేవల నేగుదేరఁ దన కేవలశౌర్యరసప్రభావనం
భావనపిక్కటిల్ల రణపార్థుఁడు తాండ్రకులీనుఁ డత్తఱిన్.

తే. అధికబలుఁడైన యతనితో నాహవమున
కెదిరి నడచుట కూడని యిచ్ఛఁ జేర్చి
దొరు లెఱుఁగకుండ గూఢసంచరణకలనఁ
గడఁగి పరిమార్చు టుచితంబుగా యటంచు. 245

సీ. రామచంద్రునివంటి రాజత్పరాక్రమ
శాలి వాలిని ద్రుంచు జాణతనము
పార్థునంతటిజోదు పరఁగ దేవవ్రతు
మఱుపెట్టి నోంచిన నేఱతనంబు
ధర్మనందనుని యంతటిమేటికుంభజ
హరణార్థమై బొంకు దొరతనంబు
ననిలజుఁ డట్టివాఁ డతిరహస్యంబుగాఁ
గీచకుఁ దునిమిన రాచతనము
తే. తప్పు గనకుండుటలు ప్రసిద్ధంబుగాదె
జగతి నటుగాన గూఢప్రచారచర్య
నహితు నోంచుట ధర్మవే యని గ్రహించి
పనిచె నొకచారు నతఁ డుండుపట్టుఁ దెలియ. 249

క. ఆకంచుకి యల్లనఁ జని
యాకఱకుఁ రాచతేనియావసథసమా
లోకన మొనర్చి క్రమ్మఱి
యాకీ లెఱిఁగింప నెఱిఁగి యెఱిఁగి యతండున్. 250

శా. అంతం దత్సహచారియుగ్మకముగా నారాత్రివేళ న్మహా
ధ్వాంతం బెంతయు నిండికొన్న యెడఁ దద్రాజన్యసేనానివే
శాంతస్సంచరణంబున న్సమయపర్యంతంబు ప్రొద్దుచ్చి ని
శ్చింతం జేరిరి శత్రురాట్పుటగృహశ్రేణీబహిర్ద్వారమున్.
తే. చేరి యచ్చేరువ నొకింతసేపు దడసి
యాలకించుచుఁ గడునిశ్చలాకమైన
తరిని ఢేరాకనాతుకుట్టారసి దానిఁ
దనక రాచూలిచేఁ జించుకొనుచు నేగి. 252

చ. తెలతెలవేగునంతట నతిస్థిరతన్నృపసుప్తమందిర, స్థలనిక
టస్థజాగ్రదురుదర్శకయుగ్మము హెచ్చరించుచున్, నలికిడి
పుట్టనీక నిశితాసి నగల్చి మృగంబునొంపు బె, బ్బులిగతిఁ
బొంచి పొంచి చని భూపతి యున్నతిరంబు డాయుచున్.

సీ. మణికుండలద్వయీఘృణిమండలంబుల
దుమికెడు చెక్కుటద్దములవాని
నల వసంత జయంత నలకూబరాదుల
నట్టిట్టుపఱచు సోయగమువాని
భాగ్యలక్ష్మీసభాభవనాయితములైన
తామరసాభనేత్రములవాని
హంసనంసత్తూలికాభ్యంచితంబైన
హొంబట్టుపఱపుపై నొప్పువాని

తే. హస్తకములకృతోపబర్హంబువానిఁ
గించిదున్మీలితాక్షుఁడై మించు విజయ
రామరాజవసుంధరారమణుఁ గాంచి
తాండ్రపాపయ్య కోపంబు దీండ్రిలంగ. 254

తే. పులిపులి యటంచు మిగుల నార్పులు నిగుడ్చు
నంతలో మేలుకాంచి యయ్యవనిపాలుఁ
డియ్యెలుంగెల్లఁ దాండ్రపాపయ్యపలుకు
తెలుఁగుఁ దెలిపెడు నంచుఁ జింతిలుచు లేచి. 255

క. తరవా రరసెదునెడ త
త్తర వాఱిక తాండ్రకులసుధాధాముఁ డుదా
త్తరవారభటిన్మదవ
త్తరవారణమునకుఁ దూఁగు తద్రిపుసరణిన్. 256

తే. కదిసిపైఁ బడి యొక కేల నదిమినట్టి
వాఁడివాలున వక్షఃకవాటపాట
నంబు గావించె నతని యానాభికుహర
విదళితాంత్రవ్రజంబులు వెలికి నుఱుక. 257

సీ. నరసింహనఖరకోణప్రభిన్నహిరణ్య
కశిపుప్రకారంబు గారవించి
మరుదాత్మసంభవు కరవాలదళితదు
శ్శాసనాకారంబు నీసడించి
కుంభజాత్మజాకుంఠకృపాణికా
భిన్నధృష్టద్యుమ్ను చెన్నువడసి
వైనతేయత్రోటికానిర్దళన్మహో
రగరాజతేజంబు రహి వహించి

తే. ధరణిఁ దొరఁగెడు పార్థివోత్తమునిఁ జూచి
నల దిలీప భగీరథ నహుష రంతి
శంతనులపోల్కిఁ దగెడు రాజన్యమణికి
నీకు నిటువంటిదశ యబ్బెనే యటంచు. 258

మ. అపు డాతాండ్రకులాభిమాననిధి యాహా రాజదేవేంద్ర నీ
విపులప్రాభవశక్తి నీనిఖిలపృథ్వీభారధౌరేయతా, నిపుణ
త్వంబును భాగ్యము న్వ్యర్థ చన న్నిచేయు దుశ్చేష్ట ని
ట్లుపభోగింపఁగ నయ్యె నిట్టివెత యం చుద్వృత్తి వర్తిల్లఁగన్.

తే. తాండ్రపాపయ్య నలువుధౌర్త్యంబువలన
శత్రువర్యుండు పులివాతఁబడ యయ్యె
ననుడు రొదపుట్టె నంత నయ్యవనినాథు
బలము లార్తరవంబునఁ గలయఁ బర్వె. 260

సీ. తనచావు స్వర్గసిద్ధంబుగా మది గోరి
సాహసకృతికినై చన్నవానిఁ
దనయేలికవిరోధిదర్పంబు మాపుట
పరమార్థ మని యేరుపఱచువానిఁ
దమపడినట్టి బన్నముల కిక్కార్యంబు
ఫలరూప మని యాత్మఁ దలఁచువానిఁ
దనకులస్వాములందఱు మెచ్చుకొన నోర్చి
పగదీర్చుకొన్న సంభ్రమము వానిఁ
తే. దాంద్రకులజునిఁ బొదివిరి దారుణముగ
ఘోరయుద్ధంబు సలిపి యవ్వీరవర్యు
జిదిమి వైచిరి కఠిననిస్త్రింశతతుల
నతనిసహచరయుగళసంగతముగాఁగ. 261

సీ. లీలమై జాభరల్లీయుబాదుర్లాది
సర్లస్కరుల గిట్టి జయముఁ గాంచి
యసురు లాఖానుని యంతలేసి స్వబాల
నొగిజలేబునను గొల్వించి మించి
కిమిడిచీఁకటిరాజ్యరమలు చూఱలు గొని
తద్దుర్గములమీఁద దాడి పెట్టి
యాగౌతమీకటకాంతరాళభూమా
తలము నేకాతపత్రముగ నేలి
తే. గరిమ జగదేకవీరవిఖ్యాతి నొంది
విక్రమము గన్న రాజన్యచక్రవర్తి
వకట నేఁ డిట్లు శాంద్రపాపయ్య యనెడి
వెలమబెబ్బులిపాలైతివే నరేంద్ర. 262

తే. అనుచుఁ బరివేదన మొనర్చి రమ్మహీశు
హితపురోహితబాంధవప్రతతులెల్లఁ
దిట్టితే గుద్దినట్లును గట్టికుడుపె
నితనిదుష్కృత మని పల్కి రితరజనులు. 263

ఉ. ఆతదనంతరంబున మహాకులతన్ శిబిరంబులో జన
వ్రాత మొనర్చు క్రందలివిరావముచే నిదమిత్థ మన్న వా
ర్తాతతిశూన్యమై కలవరంపుఁదనంబున నెట్లొ కాకయన్
భీతిపరాసు తేదు కొలిపించె నగాదు ఫిరంగు లాపయిన్. 264

తే. ఆఫిరంగులరవళికి నానృపాలు
శిబిరమెల్ల చికాకయి చెదరఁ దొణఁగె
నపు డరాజక మైన తదావసథముఁ
గొల్లపఱచిరి కొల్లరు గ్గొల్లగాండ్రు. 265

వ. అంతట. 266

తే. రావువారిసంబంధి యుగ్రముగ వచ్చి
నృపునిఁ జంపుట నుభయసైనికులు వినిరి
రాజుచావుకు నంత ఫరాసుబలము
సంతసం బందె హైదరుజంగు తక్క. 267

మ. చని యారాజకళేబరంబు గని తచ్ఛారీరసంబంధు లం
త నితాంతార్తిని రోదన ల్సలుపుచు న్నానావిధానూనత
ద్ఘనసైకాద్భుతకృత్యసంపదలచందంబు ల్వితర్కించుచుం
దనరం దన్మరణాతిచిత్రమహిమ ల్తర్కించి వాక్రుచ్చుచున్.

వ. అంత. 269

సీ. సంపూర్ణరుచి మించు చంద్రబింబములేక
పరఁగెడు నక్షత్రపంక్తిమాడ్కి

వృషభహీనంబైనవిహ్వాలత్వముఁ గాంచి
కనుగని పరచు గోగణముభంగి
సురుచిరాకృతిఁ బొల్చు తరలరత్నము వీడి
దొరఁగెడు ముత్తెంపుసరులరీతిఁ
గరచరణాంగరేఖావైఖరులు గల్గి
శిరముఁ జెందని కళేబరముభంగిఁ
తే. జతురచతురంగనికరసంగతము నయ్యు
రాజమణి శూన్య మగుట నిస్తేజ మగుచుఁ
దన్మహారాజసైన్య మంతయును గదలి
వేగ తరయానమునఁ జేరె విజయనగరి. 270

శా. గంధాంధద్విపమండలంబులు మొదల్గా తద్ధరిత్రీభుజ
స్కంధావారముచూఱగొన్నతుదమూసాబూసికీరావుసం
బంధుం డొక్కరుఁ డేగుదెంచిబలిమిం బై వ్రాలి రాజన్యహృ
ద్గ్రంథిచ్ఛేదన మాచరించె నను వార్త ల్వచ్చుచో నత్తఱిన్.
చ. వెలమలసాహసం బమరవీరులయందు సురేంద్రనందనా
దులయెడ నైనఁ గాన మని తోరపుటక్కజమంది యందిపై
నలఘుపరాక్రమాతిశయుఁడై దగుతాంధ్రకులాగ్రగణ్యుదో
ర్బలము నుతించె బూసి బహుభంగులఁ దత్కృత మాత్మ
మెచ్చుచున్. 272

శా. ఎన్నన్రాని మహాభిమానినిధులా యీవెల్మవారింటిపై
కెన్నండు న్వినలేని కృత్యమునకీ ట్లెంచు రాజన్యపా
పౌన్నత్యంబునఁ దాంద్రపాపనృపవర్యాకారత న్మాత్యువా
సన్నంబై తెగటార్చె దుష్కృతి ననిష్టప్రాప్తి గా కుండునే.

క. అనుచు పఠానులదారతన
మనమున నివ్వెఱఁగు గాంచి మన్నెహంవి
రుని రావువంశసంభవు
ననఘమతిం బిలువ బంచి యాదర మొదవన్. 274

ఉ. వెంగళరాయభూవిభుని విశ్రుతకీర్తిని గారవించి త
త్సంగరపాండితీమహిమ తద్విజయద్రఢిమంబునుం దదీ
యాంగబలప్రభావము ముదావహమై బరగ న్నుతించి యి
చ్చెం గడువేడ్కఁ గొత్తపలిసీమ మొదల్గలకొన్ని రాజ్యముల్.

క. హయములు మఱియుం గుంజర
చయములు మృదులాంబరములు జాగీరు లుదా
రయశుఁడు మూసాబూసియు
రయమున నిడి యేగె హైదరాబాదునకున్. 276

తే. అంత నా రావువంశనీహారధరుఁడు
కొత్తపలిరాజ్య మేలుచోఁ గొమరుమిగిలి
కలితకళ్యాణవిభవసంగతి వహించె
భావిసౌభాగ్యసూచకప్రౌఢి మెఱయ. 277

మ. కలితప్రాభవధుర్యుఁడై కొనియె వెంగల్రాయ డంతన్ విని
శ్చలశౌర్యోన్నతిచేఁ దలిర్చుచు సీమంచల్లిలఁ జెల్వొందు
బొ,బ్బిలిరా జాములువాటియందు మును తత్పృథ్వీశ్వరాజ
త్తి ను, న్న లసత్సైన్యముమీఁదఁ దారసిలుచున్ దానా
లుఠాయించుచున్. 278

సీ. రాజకీయవిధాన యోజనోద్యోగంబు
లంచితస్థితి విమర్శించుకొనుచు

నఖిలప్రజానుపాలనమార్గములయందు
విహితక్రమంబులు వెదకికొనుచు
గురువిప్రబాంధవోత్కరములపట్టున
ననువొంద హితవృత్తి నరసికొనుచు
ధర్మార్థసంగ్రహతత్పరజ్ఞానంబు
తెలుఁగు ప్రాజ్ఞులయందుఁ దెలిసికొనుచుఁ

తే. దనయశశ్చంద్రికలు దిగంతమును నిండ
నామృగాంకార్కముగ సతం డాత్మవంశ
ముత్తరోత్తరవృద్ధిఁ బెంపొందుచుండ
సొంపు దీపింప నవని పాలింపుచుండె. 279

క. అని బొబ్బిలిరంగారా
యనృపాలచరిత్ర మెల్ల ననిమిషపతికిన్
వినిపించి నారదుండును
ననుమతిఁ గొని చనియె నంత నంతర్హితుఁడై. 280

క. ఇది యానుపూర్వితముగాఁ
జదివిన వ్రాసినను వినిన జనులకుఁ గడుస
మ్మద మొదవించున్ సంప
త్ప్రదమై యభిమానశౌర్యధైర్యాస్పదమై. 281

ఆశ్వాసాంతము.

శా. సాధుస్తోమనికామకల్పితగుణశ్లాఘాంచద్గుణాలంక్రియా
రాధాసూనుసమానదానకలనా రాజన్నిజప్రక్రియా
బోధాగాధరమాధురీణహృదయా పుంభావభద్రద్వయా
మాధుర్యైకనిదానవాక్సముదయా మల్రాజవంశోదయా.

క. విరియాలగోత్రవారా
కరరాకకై రవాప్తకారుణ్యరస
స్ఫురణాభరణాధరణీ
భరణక్షమదోః ప్రసరణపండితశరణా. 283

మాలినీ. వనధినిభగభీరా వైరివన్యాకుఠారా
తనురుచిజితమారా ధర్మమార్గప్రచారా
జనవినుతవిహారా సత్యవాచోవిచారా
కనకశిఖరిధీరా కాంతమాంబాకుమారా. 284

గద్యము. ఇది శ్రీమత్కాశ్యపగోత్ర దిట్టకవివంశ పవిత్రాచ్చ నామాత్య పౌత్ర పాపరాజకవిపుత్ర శ్రీరామచంద్ర చరణారవింద ధ్యాన పరాయణ నారాయణాభిధానప్రధాన మణిప్రణీతం బైన రంగారాయకదనరంగచరిత్రం బను మహాప్రబంధంబునందు సర్వంబును తృతీయాశ్వాసము.

---

చెన్నపురి: వావిళ్ల. రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్ వారి
ఆదిసరస్వతీనిలయముద్రాక్షరశాలయందు
ముద్రితము—18-9-1914.

| | ప్రతి 1 కి | రు. | అ. |
|---|---|---|---|
| అధ్యాత్మరామాయణకీర్తనలు, వర్ధ్యనిప్రతి, చిన్నసైజు | ... | 0 | 6 |
| ఐవన్హో నవల | ... | 0 | 6 |
| మృణాళిని ,, | ... | 0 | 10 |
| తారాభాయి ,, | ... | 0 | 12 |
| ఈ వ్యాదిని ,, | ... | 0 | 4 |
| రాధారాణి ,, | ... | 0 | 4 |
| ఈసపునీతికథలు, క్రొత్తకూర్పు 1 వ భాగము | ... | 0 | 6 |
| డిటో 2 వ భాగము | ... | 0 | 8 |
| దక్కనుపూర్వకథలు, శ్రీసీతారామశాస్త్రికృతము | ... | 1 | 4 |
| సంస్కృతనాటకకథలు ,, ,, | ... | 0 | 12 |
| లార్డుక్లైవు జీవితము | ... | 0 | 6 |
| ఆనందమఠ, వచనము, నూతనముద్రితము | ... | 0 | 12 |
| శ్రీమద్రామానుజాచార్యచరిత్ర | ... | 0 | 2 |
| శాలివాహనచరిత్ర | ... | 0 | 2 |
| దాదాభాయి నౌరోజీచరిత్ర, ప్రతిమతో | ... | 0 | 1 |
| సూరతుకాంగ్రెస్సు ఉపన్యాసములు | ... | 0 | 2 |
| ఆనిబిసెంటుచరిత్ర, ప్రతిమతో | ... | 0 | 1 |
| శ్రీగైక్వారుగారి ఉపన్యాసములు | ... | 0 | 2 |
| బాలగంగాధరతిలకుగారిచరిత్ర, ప్రతిమతో | ... | 0 | 2 |
| వివేకానందస్వామిజీవితము, ప్రతిమతో | ... | 0 | 1 |
| శ్రీకృష్ణదేవరాయచరిత్ర ,, | ... | 0 | 2 |
| నీతిచంద్రిక, చిన్నయసూరి-గారిది | ... | 0 | 6 |
| స్వామి రామతీర్థజీవితము | ... | 0 | 1 |
| భోగినీదండకము, బమ్మెర. పోతరాజప్రణీతము | ... | 0 | 1 |
| శ్రీశంకరాచార్యచరిత్ర, ప్రతిమతో | ... | 0 | 2 |
| రామకృష్ణపరమహంసచరిత్ర ,, | | 0 | 2 |

వావిళ్ళ. రామస్వామిశాస్త్రులు అండ్ సన్సు,

102, ఎస్ప్లనేడ్. చెన్నపురి.